# పండుగ కట్నము.

కృతికర్త:

భోగరాజు నారాయణమూర్తిగారు

విజయనగర సంస్థానాస్థానకవి.



రాజేశ్వరి బుక్కుడిపో

పాలకొండ

విశాఖపట్నంజిల్లా.

 [వెల 1—0—0

1927

రెండవకూర్పు
1000 ప్రతులు.

## సరస్వతీస్తవము.

అహరహమస్మదీయహృదయాంచిత కాంచనపీఠిపై శుభా
వహమగు త్వన్నిజాకృతిని భద్రముగా నెలకొల్పి, భక్తిమై
బహుగతుల న్నుతింతు నెడఁబాయక న న్గరుణించి, భారతీ
తుహినకరాననా! యెటులఁదోడ్పడెదో నవకావ్యకల్పనన్

సీతారామాంజనేయ ప్రెస్
రాజమండ్రి.

పండుగ కట్నము

శ్రీ గలయత్తవారు తొలిఁ జెప్పినరీతిని గట్నమీయమిన్
జేగురుమోముతో సలిగి చివ్వన నేగెడు క్రొత్తయల్లుఁడో
నాగనిజార్ధుణపత్రిభలనంతముగా దిశలన్ వెలుంగఁ దా
నేగె దివాకరుండు జగమెల్లఁ దమంబున దుస్తమమ్ముగాన్

శా. శ్రీకృష్ణుండువరింపఁజేసితిని నాచెల్లిన్ వివాహంబునన్
లోకుల్ మూఢమువోవుఁగాననికనీలో నెట్టి సంబంధముల్
చేకూర్పంగలరోకుమార్తెలకువీక్షింతుంగదాయంచు, నా
రాకాచంద్రుఁడు మింటనిల్చెఁగడుగర్వస్ఫూర్తి దీపింపఁగాన్

ఉ. కానుకగొన్నయల్లునిమొగమ్ముగతిన్ గలువల్ హసింప; నే
కానుకలేనియల్లుని మొగమ్ముగతిన్ ముకుళించెఁ బద్మముల్
జౌసదినైజ మొక్క నిలయమ్మునఁ బుట్టి సమానధర్మముల్
పూనియు నిట్లగౌరవమువొందుచుసాధువు సాటివారిలోన్.

క. ధనికుల చుట్టరికము ని
ర్ధనికునకుఁ బరాభవప్రదమ్మని చంద్రిన్
గనినంతనె యుడుగణములు
[illegible]త్రములోనఁ దొలఁగి చన నచ్చటికో॥

ఉ॥ ఇచ్చెదరున్న వార లటులీయఁగఁజాలరు లేనివారలే
మిచ్చుటకేనియున్ దగియు నీయరులోభులటంచు నెల్లెడన్
జొచ్చి, వివాహలగ్నములఁ జూచుచు నల్గినయట్లు నల్క న
య్యచ్చపుమందగంధవహుడంతయుఁ బాపెనుదా నెమాయమై॥

మ॥ సరసీజారిచకోర దంపతులకుత్సాహమ్ము గల్గించి దు
శ్చరుఁడై పాపముచక్రదంపతులకున్ సంతాపముంగూర్చె; నొ
క్కరికిన్ మోదముఖేదమింకొకరికిన్ గల్గన్ బ్రయత్నించుటల్
సిరితోఁ బుట్టినవానినైజగుణముల్ సిద్ధాంత మెందేనియున్

మ. వరుసన్ మేల్ కరదీపికాశతములన్ భాసిల్లు పెండ్లిండ్ల పం
దిరులన్ వెన్నెలఁజొన్పిచంద్రుఁడు మరెంతేశోభగల్గించె; ని
ష్ఠురుణన్ బేదకుమారిద్రవ్యయుతునిన్ గట్నాల మన్నించుటల్
సిరితోఁ బుట్టినవాని నైజగుణముల్ సిద్ధాంత మెందేనియున్

మ. మరియుం బెక్కగతుల్ ప్రమోదమును నాత్మంగొల్పె
[నారాతిరిన్
బరహాంపూరుననొక్కయింటనొకడాబాపై నిగూర్చుండిసుం
దరియాభార్యయులోభియాపతియునుద్వాహ ప్రసంగమ్మునన్
వరుసన్ వాదములాడఁజొచ్చిరియభిప్రాయంబు భేదించుటన్

ఉ. క్రిందటిమాఘమాసమున కేమనసీతకుఁ బెండ్లియాడు ద
ప్పెందలవంపుగల్గునది పెద్దదియానెడ; దానియీడు వా
రెందరొ కాపురంబునకునేగుటచూచితి, మీరునేనునున్॥

దొందరచెందకున్నయెడ నూయియొ గోయియొచూచు
[క్రోవలెన్.

చ. కడచినకార్తికంబునకెగా పదమూడవయేఁడువచ్చె నీ
గడియకుఁబెండ్లిమాటకలగానయినన్ స్మరింయిపరైరి; విూ
గడుసుఁదనంబు పోల్చుకొనఁగాఁదగుజాణనుగానుగాని యా
బుడుతన్లఁగూర్చి యేమితలపోసిరొ చెప్పఁడు! ప్రాణనాయకా!

ఉ. పక్కననవ్వెపోయిరఁట బంధువులందరుఁబెండ్లియందు సు
బ్బక్కకుమార్తెపందివలెఁ బల్లకినెక్కుచునుండ; నందరున్
ముక్కనవ్రేలు పెట్టుకుని మొట్టలుమొట్టరె? మీరునేనునున్
లొక్కవయాదుమిట్లయినలోకులుకాకులు మీరెఱుంగరే?॥

చ. మఱియొకసంగతిన్ వినుఁడు! మాపెదమామయగారిచిన్నకూ
తురుగతియేమియైనది? యెదుర్కొనువేళకుఁ దోటలోన నం
దఱుఁగని పెండ్లికూతురు విధమ్మురజస్వల యట్టులున్నదం
చరిగిరికాదె భోజనముకైననుజేయక తత్క్షణమ్మునన్.

సీ. మధుపర్కమునుగట్టి మగనిచాటున నట్టె
నక్కుచుఁబల్లకి నెక్కునపుడు
తలుపులకడ ముద్దుగొలుక వచ్చియు రాని
పలుకులఁ బతిపేరు పలుకునపుడు
చుట్టుమూగినయట్టి చుట్టాలు ముచ్చటన్
గనుచుండ మగఁడెత్తుకొనిన యపుడు
పతిచెంతఁగూర్చుండి సతులు పాటలుపాడ
నతనితోఁ బూబంతులాడు నపుడు

పడెనిమిదేండ్ల బిడ్డయానేని మిగుల
శోభగానుండునేకాని చూచుటకును;
కట్టుతప్పి పెండిలియీడుగడచి గేదె
పడ్డవలెనున్న బిడ్డ శోభస్కరంబె?"

ఉ. ఇన్నిటికేమి నాకు నయిదేడులు వచ్చెనో లేదొకాని మ
నాన్న వివాహయత్నములొనర్చుచుఁ బెండిలియీడుదప్పిన
చిన్నకుమార్తెకంచుఁ గడుఁ జింతిలుచుండుట నాకుజ్ఞాపక
మున్నది; ముద్దుముచ్చటయునుండునెయంతకునీడుమించినన్

ఉ. జ్ఞానమువచ్చి సీతచెలికత్తియలందరుఁ బెండ్లియాడఁగాఁ
దానటులుండిపోవుటకెదన్ గ్రహియించుచునెన్నిమార్లొ నా
తోననెఁ నాన్నగారికిఁకఁ దోచకపోయిన నీవెచెప్ప వ
మ్మా! ననుఁగూర్చి'యంచు; నవునట్లనినందునదోషమున్నదే

ఉ. అక్కట! పెండ్లిలేదనెడునట్టి విచారముచేతనే కడున్
జిక్కియొకప్పుడున్ గడుపునిండభుజింపక నిద్రపోక యీ
ఫక్కిని లేనిజబ్బు బలవంతముగాఁగొనితెచ్చుకొన్న దీ
చిక్కుతొలంగి పెండ్లియయి సేమముగాంచుటయెన్నఁడో కదా!

ఉ. మంచముపట్టియున్న దొకమాసమునుండియునౌషధంబులి
ప్పించితిమెన్నియో గుణమువీసముగల్గదు, డబ్బుగూర్చి ల
క్షించక రెండువారముల క్రిందటనే దొరసానినుంచి వా
మెంచి రవంతయైన గుణమీయకయున్నదదేమిపాపమో!

గీ. చిన్న సీతమ్మ! నిన్న మీనాన్నగారు
నీకు మంచిసంబంధము నిశ్చయించి

నారనుచు దాని సంతుష్టిఁగోరి నేను
సీతతోనంటి నేమానో చూతమనుచు.
ఉ. కాటుకకన్నులన్ వెడలికాలువకట్టిన నీటిబొట్టులన్
బైటచెరంగుతోఁ దుడిచి ప్రక్కకుమోమిడి వెక్కివెక్కినా
మాటకదేమికారణము మారువచింపక యేడ్వఁజొచ్చె; నా
నాటికిసీతసంగతి కనంబడుచున్నది క్రొత్తవెఖరిన్.
నా. ఏఁడీ? ఎక్కడ? రామచంద్రుఁడిఁక రానేరాడ! రేపైనవ
స్తాడా?' యంచునుబల్వరించునఁట యూష్ణంబందునిన్నమా
టాడంగా దొరసానిచెప్పినది; యేమైనన్ రహస్యంబు మీ
తోడన్ జెప్పెద మీరునమ్మెదరొ లేవో కాని నామాటలన్
నిరుడు వేసంగిలో రెండునెలల సెలవు
గడపె మనయింట రామచంద్రుఁడది మొదలు
వాస్తవమ్ముగ మనసీతవర్తనంబు
నాకుఁ గ్రొత్తగాఁదోచుచున్నది యదేమొ?
సంగతులను సందర్భము
లం గనుఁగొన సీతమనసు లగ్నంబై యుం
డంగావలె నాతనియం
దుం గావున నేమిసేయుదురొ మీరింకన్.
పదెనిమిదేండ్లు రాకమున్నే వివాహ
మాడు బిడ్డకుఁ గావలెననుచుఁ బెద్ద
లూరకే ఘోషపెట్టిరే? కారణమ్ము
బోధపడినదికద సీతబాధవలన.

క. పదమూడేడుల చిన్నది
చదువులు చదివినది మిగులఁ జక్కనిదై కో
రదె స్వయముగ వరునీగతి ?
అదిమీతప్పగును దాని దనరెవ్వారుఁ ?

గీ. రామచంద్రుఁడు తనకు భారతమునిచ్చి
చదువుకొనుమనెనఁట ! యది మొదలుగాఁగ
బావగారిచ్చిరని యదేపనిగఁ జూచు
చుండు నందరి కుపొంగుచుండు నెపుడు.

గీ. ఏమి గ్రహచారమోకాని రామచంద్రుఁ
డన్న సీతకు దైవమైయున్నవాఁడు
దానిదురదృష్టమో ? లేక దానిపేరు
బలమొ ? యేమికానున్నదో తెలియదకట.

ఆ. వె. నాటినుండియిట్లు నలువురినోళ్ళలోఁ
గంట్రికంబు పడినకారణమునఁ
బనసపండువంటి బాలికారత్నము
చిక్కిశల్యమయ్యె నక్కటకట !

శా. చాద స్తంబిఁకమానిప్రొద్దున నెపంచాంగంబుచూపించివి
రేదేనా సుముహూ ర్తనిశ్చయము చేయించండి? మేనల్లు
నేదెల్లిన నదల్లియాను ముడివేయించండి సీతమ్మకుఁ
మీదఁ దైవమెయున్నవాఁడుమన మేమీచేయలేమేకదా

ఉ. తోటలుదొడ్లు భూమివసతుల్ మొదలై నవిలేకయున్న నా
పూటకులేనివాఁడయిన బొట్టె నొసంగక తప్పదింక; నా

మాటవినండి! దీనికణుమాత్రము నష్టముచెప్పకండి? యీ పాటికినైన సీతకు శుభంబనుమాట యనండి నోటితోన్.

గీ. నా వివాహంబునందు మానాన్నగారు
నాల్గుగరిసెలమడిచెక్క నాకొసగిరి
సీతకరణమ్ముగానిచ్చివైతుదాని
భూవసతిలేనిలోపమ్ము పుట్టదింక॥

గీ. ముక్కు మొగమునెఱుంగని దిక్కుమాలి
నట్టి పెద్దసంబంధాల కాశపడక
చెప్ప చేతలనున్నాడు సీతనింక
రామచంద్రున కొసఁగుడీ రవ్వయేల?॥

క. బియ్యేలఁట ! యెమ్మేలఁట!
వెయ్యిన్నూట పదియార్లు విసుగూనకయే
పొయ్యాలఁట! బై స్కోల్లను
నియ్యాలఁట! యల్కనాఁ డివెక్కడియాసల్?

క. తప్పనిసరియని యన్నిటి
కొప్పుకొనుచుఁ గడుఁబెండ్లి యొనరించినచోఁ
జిప్పయు దొప్పయుఁ జేతికిఁ
దప్పకవచ్చును సుమండి తలిదండ్రులకున్॥

ఉ. పెద్దపరీక్షప్యాసయిన పిల్లఁడటంచును నీసుజోసుమేల్
ముద్దుగ నున్నదంచుఁ దనముద్దులబిడ్డను డబ్బునిచ్చియున్

గుడ్డిదులుదిన్నయట్లు తరిగొప్పల వేంకటరావుకిచ్చి యే
పొద్దును భీమశంకరముపొందు విచారము చెప్పవచ్చునే?

ఉ. పెండిలియాడికట్నముగఁ బెట్టినదంతయు మూటగట్టి, యు
ల్లుండలయుత్తమామయు నలోమనియేడ్వ నదేపరీక్షకో
లండనుబోయి నేటికిని రాఁడుగదా పదియేడ్లనుండి; యే
ముండనొకూడివాఁడుచెడిపోయెనటంచనుచుందురందఱున్॥

సీ॥ పుట్టెడు వగపుతోఁ బట్టెడన్నమునైన
ముట్టక తనుదానె తిట్టుకొనుచు
ధూర్తుఁడై చనినట్టి భర్తపై జనియించు
దుర్వార్తలాలించి దుఃఖ పడుచు
తనయీడు చెలుల నూతన కాపురమ్ములు
గని వేడినిట్టూర్పు గార్చుకొనుచు
నాకు దిక్కెవరున్నారింక నయ్యోనా
పాపమంచును గుండెబాదుకొనుచు
పెద్దదైనట్టి యైదేండ్ల పొద్దునుండి
మగని మొగమెట్టిదో తాను మరచిపోయి
కడవల కొలంది నేడ్చు శంకరముగారి
కన్నకూతురి దురవస్థకాంచినారె?

సీ॥ మేస్టర్లచేఁజాల మెప్పించుకొన్నాఁడు
మంచివాఁడను పేరుకాంచినాఁడు

పోకిరీవేషాలఁబో దూర్జితంబున్న
వాఁడు పాపము దుండగీడుకాఁడు
చురుకైనవాఁడు ముందరికిరాఁగలవాఁడు
మంచిచెడ్డలెఱింగి మసలువాఁడు
మనసీత మనసుకెక్కినవాఁడు మంచిచ
క్కనివాఁడు మీరెదిక్కనినవాఁడు
చిన తనంబునుండి మనయింటనున్నాఁడు
తల్లితండ్రిలేని పిల్లవాఁడు
పెంచిపెద్దఁజేసి పిల్లనిచ్చుటకన్న
పారమార్థికంబు వేరుగలదె?

జా. కాఁగలవాఁడువిద్యయునుగౌరవముంగలవాఁడువాఁడు,మీ
రేగతి, పారమార్థికమునెంచి కుమార్తెనొసంగిరేని మే
లౌఁగద ? యింతయాస్తియును నక్కట ! నెత్తినిబెట్టుకొం
[చు నూ
రేగుదుమే? కుమారుఁడొకఁడేనియులేనిదురంతచింతతోఁ.

ఉ. కాలువప్రక్కభూములు, నెగాదిగఁబండెడు పెద్దపెద్ద సే
రీలును, గుత్తచేసిన ఖరీదగు తోటలు, నప్పులిచ్చి వ
డ్డీలకువడ్డికట్టుచు గడించిన మూటలు త్రుప్తిలేకయే
వేలకు వేలుగా నిలువవేసితి రార్బతునాటుబ్యాంకిలో !

క. కొడుకైనఁ గూతురైనను
గడకదియేకాన మనసుగలవానికి మీ

బిడనొడఁగూరిచి వడి మీా
గడియించిన దొసగి రేని గల విహపరముల్.

క॥ దత్తతగూరిచి లేశము
చిత్తమునఁ దలంపఁబోక, శీఘ్రమువను లా
యత్తపరచి మేనల్లున
కుత్తరమును వ్రాసిపంపుఁ డుత్సాహముతోఁ.

గీ॥ అనియనేకవిధమ్ముల నాత్మజాత
పరిణయముఁగూర్చి యిల్లాలు పలికినట్టి
పలుకులన్నియు నాలించి యులికిపడి మ
హాగ్రహావేశ పరవశుండగుచు నపుడు.

సీ. శిరమునగోష్పాద పరిమితిగలపండు
వెండ్రుకల్ ముడివీడి వెన్నునంట
నొసటి గందంపుఁబూత నెసగుకుంకుమబొట్టు
చిఱుచెమ్మటలఁ గ్రమ్మికరగిచెదర
మెడలోనఁ జీరాడు మెరుగుబంగరుకట్ల
తులసిపూసలమాల దుసికిలంగ
పొడిదగ్గుచే బుగ్గనిడినట్టి కలకండ
సారమ్ము బొజ్జపైఁ గారుచుండ
ముడుతముడుతలు పడినట్టి యొడలువడఁక
పట్టుతప్పి దొడలువ్రేలబడఁ జికాకు

చూపుచూపులఁ జురచురఁ జూచిచూచి
భార్యకిట్లనిపల్కె నా బ్రాహ్మణుండు.

|| వె|| ఔనె! మాటకారివగుదువె కాని, నీ
పాటితెలివిలేని వాఁడఁగాను
మూయుమింకనోరు ! నీయుపన్యాసంబు
వింటిఁ జాలునింక వినుగుపుట్టె.

|| వె|| స్టేజిపైని నిల్పి చెప్పించినట్లైనఁ
గడఁగి లెక్చరీయఁగలవు నీవు
మాటనేర్పులేని మందబుద్ధిని సమా
ధానమేమి చెప్పలేను నేను.

|| వె|| మంచిచెడ్డలను గ్రహించక యిట్లెవ్వఁ
డాడుగాని కధికమైన చనువు
నిచ్చి నెత్తిపైని నెక్కించుకొనువాని
బ్రతుకు వట్టి రవ్వపాలుగాదె ?

గోరంత జబ్బున్నఁ గొండంతగాఁజేయు
గయ్యాళి వగలఁకు గలతచెందు
ఆలిమాటల నమ్మి యానుగాదనకుండ
ముసలి తల్లినిగాంచి కసరుచుండు
తోడఁబుట్టులనైన దూరమ్ముగానుంచి
కులకాంత సెలవుపై మెలఁగుచుండు
వెలది పల్కినపల్కు వేదవాక్కనిమెంచు

సుదతియే మోక్షమంచును దలంచు
తరుణి పాదములకు దాసుఁడై దాస్యంబు
సేయువానిస్థితులు వేయిగతులు
మగువ! యట్టి పనికిమాలిన పెద్దమ్మ
యాలిచేతిలోని కీలుబొమ్మ॥

ఉ. పాయని రోగమందుఁ బసిబాలదగుల్కొనె, దీననేమహా
పాయమొ? యేమిదారి? భగవంతుడ! యంచుననేడ్చుచుండ"పె
ళ్ళో"యనిప్రాణముల్ గొఱుకుచుందువునీమతిపోయెనేమొ? నీ
కీ యవివేక మెప్పటికి నిట్టులెయున్నదదేమి పాపమో?

ఉ. బోలెడు డబ్బుపెట్టి గొనిపోసిన మందులు వ్యర్థమయ్యె, నే
వేళకునెట్టిసంగతి చెవిం బడునోయని యిట్లు కంటికిన్
నేలకునేడ్చుచుంటి నిదినీవుగ్రహింపక మూర్ఖచిత్తవై
ప్రేలుచునున్నదాన నవివేకునిక్రింద ననుంగణించుచున్.

సీ॥ రామచంద్రునిగాంచి ప్రేమించి మనచిన్న
ముద్దు సీతమ్మ యెప్పుడువరించె
తనకు వానికిఁబెండ్లి యొనరింపుమని సిగ్గొ
కింతైన లేక నిన్నెప్పుడడిగె
జ్వరతీవ్రమున రామచంద్రా! యటంచు నా
పసికూనయెప్పుడు పలవ్రించె
ఆమాటలాలించి యవివేకురాలైన
దొరసాని యెవుడు నీతోడఁజెప్పె

కన్నుపీడని యూపసికందుపైని
నెంతవరకు గల్పించినావే గయాళి!
విన్నవారు నవ్వెదరఁ వివేకమెందు
వలనఁ గలుగదో నీకు నిర్భాగ్యురాల!.
మోహమున భర్తయన్న నేమో యెఱుఁగని
చంటికూన కోరునె రామచంద్రునట్లు?
సీతసతనికిఁ గూర్పంగ నీతలంపు
గాని సాగని కోర్కెలు మానుమింక.

॥ కంచుకాగడాలెత్తి ప్రపంచమెల్ల
నెంతవెదకిన నొకబెత్తెడేని భూమి
వసతిలేని దరిద్రుని పాలుచేసి
కూతుమెడ తెగనికత్తిని గోయఁగలమె॥

విద్యగలవాఁడెయగును; వివేకవంతుఁ
డేయథార్థము; రూపసియే నిజమ్ము;
కాని భూమివసతిలేని కారణమున
నన్నియును సంకెలేసట్టి సున్నలయ్యె॥

గీ॥ వెండిచెంబులు నుంగరాల్ విలువగలుగు
మేటి బంగారు మొలతాళ్ళ మాటకేమి?
పట్టుపంచల చాపైనఁ గట్టుకొనుట
కర్హుఁడై యుండవలదె నీయల్లుఁడకట॥

గీ॥ తల్లిదండ్రులు లేనట్టి పిల్లఁడనుచుఁ
బెంచి పెద్దవానినిజేసి ప్రేమతోడఁ
జదువు చెప్పించుచున్నాము చాలునింత
కన్నఁ జేయఁదగినదేమి కలదొ చెపుమ॥

గీ॥ నీవు నీమడిచెక్క వానికి నొసంగి
నంతమాత్రాన ధనవంతుఁ డగునె వాఁడు?
కాని యమ్మాయి పెండ్లిసంగతినిగూర్చి
నా మనోనిశ్చయమ్ము సాంతముగవినుము॥

మ॥ అయిదారేడులనుండి పట్టుదలతో యత్నించుచున్నాడ నెం
దయినన్ జక్కని యీడుజోడుగలవాఁ డమ్మాయికై కానరా
డయినన్ గోరినకట్నమిచ్చెనెడ నాయాసం బాకింతైన లే
కయెచేకూరఁగనున్న వెన్నొకడుయుక్తంబైనసంబంధముల్

సీ॥ వలసినంతటిభూమి వసతిగల్గినచోట
సాంప్రదాయముఁగూర్చి శంకపుట్టు
సాంప్రదాయముగూడ సరియైనదగుచోటఁ
గటకటా గోత్రమ్ము కలియుచుండు
గోత్రంబు మనకనుకూలమౌచోటను
లేశమైననువిద్య లేకయుండు
విద్యాదిసుగుణముల్ వెలయఁగల్గినచోట
నంగవైకల్యంబె సంగుచుండు.

అంగనై కల్యమును లేకయమిత రూప
వంతుఁడగు నెడఁ గట్నాల బాధమెందు;
సుతులనార్వర పెండ్లింప్ల సుళువుగాని
యొక్కయాఁడు పెండిలి కష్టమక్కటకట! .

సీ॥ వెండిపళ్ళెరమందు వేయినూటపదార్లు
గుమ్మరింపుమటంచుఁ గోరినారు
బంగారు మొలత్రాళ్ళు నుంగరాల్ మురుగులు
చేయింపుమనినాకుఁ జెప్పినారు
ఎమ్మె బియల్ ప్యాసయినదాక చదువు చె
ప్పించునాయని యడిగించినారు
సగమునాస్తిని లగ్నసమయాన వ్రాసియి
చ్చెదవాయటంచుఁ బ్రశ్నించినారు
గొంతుముడిలేక వారట్లు కోరుచుండ
గుండియలునాకు బ్రద్దలౌచుండె నకట!
ఎంతయత్నించినానొ? ముందేమిచేయఁ
గలనొ తెలియక పేర్మిలినఁ గార్యమేమి? ॥

గీ॥ కలిమియును విద్యయును రెండుగలిగి కట్న
మడుగనట్టి సంబంధమొందైనఁగలసి
వచ్చునేమోయనుచు నింతవరకుఁ జాల
యత్నమొనరించితినిగాని వ్యర్థమయ్యె॥

గీ॥ ఇందుచేతనె యమ్మాయి కింతవరకుఁ
బెండ్లికార్యంబు నేను గావింపలేదు
మంచిసంబంధమొకచోట నుంచినాను
అదియెనిశ్చయపరతు నెట్లయిన నింక.

క॥ పొన్నాడ కామరాజని
యున్నాడొక చిన్నివాఁడయోగ్యుఁడు కాఁడే
మున్నను నొక్కఁడె; తమ్ములు
నన్నలులే రాస్తియెల్ల నతనిదెసుమీ॥

క॥ పదిగరిసెల తాబడిగల ;
దదిగాకై దారువేల కధికమునగదు
న్నదియఁట! లేశము ఋణమ
న్నదిలేదఁట! కట్నమడుగఁడఁట కాసైన॥

క॥ నలువదియేండ్ల వయస్సని
పలికెదరేకాని, మూఁడుపదులకు దాటం
గల యీఁడున్నటు తోఁచఁడు
కలిపించినమాట నమ్మఁగా రాదుకదా?॥

ఆ. వె॥ అందకాడటంచు ననఁజాలనైనఁగు
రూపికాఁడు మంచియేపువాఁడు ।
నలుపు తెలుపు రెండుగలిగిన యొకచాయ
గలుగువాఁడెకాని నలుపుగాఁడు॥

క॥ పదియేఁడులు గావచ్చెను
మొదటికళత్రమును నష్టపోయియు నాతం
డిదివరకుఁ బెండ్లియాడఁడు
వదలని క్షయరోగమింతవర కుండుటచేన్॥

గీ॥ వేలువందలు వైద్యులపాలఁబోసి
కొనవరకుజబ్బు తొలగించుకొన్నవాఁడు
ఇంకసీతమ్మనిచ్చుట కెంతమాత్ర
మైన సంశయించుట పట్టియనవసరము॥

క॥ రోగంబంతయుఁబూతిగ
బాగైనదొ లేదొ యనుచుఁ బలువురితోడన్
"భోగట్టా" చేసితి నా
రోగంబికఁ గుదిరెననుట రూఢియెసుమ్మా॥

గీ॥ మొదటిభార్యకుఁగల్గిన ముప్పురాఁడు
కూనలును గూడఁబోయిరిగాన నింక
సవతిపిల్లలపోరు లేశమును సీత
కుండదేకద? హాయిగా నుండఁగలదు॥

గీ॥ తనకుసీతనిమ్మని నాకుఁదరుచువ్రాయు
చుండెనైనను గిట్టవి ముండకొడుకు
లాతఁడొకముండ నుంచుకొన్నట్లు నాకు
లేని సంశయమొకటి కల్పించినారు॥

గీ. ముండయును ముసుగులే దుత్తముండటంచుఁ
బలుకుబడిమీఁదఁ దరువాతఁదెలిసె నాకు;
అయిన నింతకు మగవాఁడు ; ఆలిలేని
వాఁడు, డబ్బున్న వాఁడు; ఏమేడుపైన
నేడ్చియుండును; ఆఘోషలేల మనకు ? ॥
గీ. ఇంతకీ కలికాలమం దెవ్వఁడట్టి
యేకపత్నీ వ్రతస్థుఁడో నాకుజెఁపుము!
పెళ్లి కానంతసే పెన్ని వేషములును
వేయు; తరువాత నన్నియు మాయమగును॥
గీ. కులము గోత్రము రూపురేఖలును గలిమి
సాంప్రదాయము నన్నియుఁ జాలవరకు
నాకు సరిపడె; కానపొన్నాడవారి
చిన్నవానికె యిచ్చెద సీతనింక॥
క. కానంత కట్నమైనను
వీసము నాసింప ననుచు విస్పష్టముగా
వ్రాసె నిదివరకె; నేనును,
వ్రాసితి శుభలేఖ యిష్టపడినాననుచున్॥
గీ. వేయినూటపదారులు పోయకుండ
మంచిసంబంధమిట్లు ప్రాప్తించెమనకు
మనయదృష్టమొ! లేక యమ్మాయిచేసి
నట్టిపుణ్యమొ! యేమైన నగునుగాక! ॥

క. రాఁగల ఫాల్గుణ మాసము
లోఁ గార్యము తప్ప ; దింతలో సీతయు నీ
రోగము కుదిరి శరీరము
బాగై యారోగ్యదశకు వచ్చునుగాదే! ॥

క. తనకు ద్వితీయవివాహం
బని, యాతం డేకరాత్రియందే కార్యం
బును జేసికొందు ననుచును
ననెనఁట! నీయిష్టమెట్లొ యట్లె యొనర్తున్॥

ఆ. వె. ఏకరాత్రి పెండ్లియేయైనయెడఁ జాల
వరకు ఖర్చు తగ్గవచ్చు మనకు;
చూడవచ్చినట్టి చుట్టాలచే నిల్లు
గుల్ల గాదు డబ్బు చెల్లిపోదు॥

గీ. అయిన నీయిష్టమే సుమీ యనుచు నతఁడు
పరమసౌఖ్యంబుగాఁ బల్కె భార్యతోడ;
ఖర్చుపెట్టని లోభుల గడుసుఁదనపు
మాటలాడువారు గ్రహించు పాటివారె? ॥

౩

పండుగ కట్నము

దశరథరాజు సీతపరిణయమ్మునుగూర్చి
పలికినట్టి వెడగుపలుకులెల్ల
నాలకించి యాగ్రహాతిశయమ్మున
మేనఁ జెమటగ్రమ్మ జానకమ్మ॥

మ॥ కడులోభిత్వమునన్ గుణహార్తిసుఖదుఃఖంబుల్ విచారింపకే
పెడదారింజను భర్తయత్నమును దప్పింపంగలేకేడ్వఁగా
తొడఁగెన్ భోరన; కార్యసాధనమునన్ దోడౌచునుండుంగదా?
కడుసూక్ష్మంబుగ నాడువారలకు గంగాదేవి ప్రత్యక్షమై.

క॥ అయ్యయ్యో యనుభార్యయుఁ
గుయ్యో మొఱ్ఱోయటంచుఁ గూతురు, గట్నం
బియ్యఁడని యేడ్చునల్లుఁడుఁ
జయ్యనఁగన్పింతురు లోభిసంసారమ్మునన్.

క॥ అల్లుళ్ళుఁ గూతుళ్ళును
నిల్లాలికి నాశ్రితులకు హితులకు నెవ్వరున్
జెల్లనికాసే నొసఁగక
ఘొల్లున నేడ్పించు లోభిగుణమ్మున్ గనిరే.

సీ॥ ఆలిపై నొక్కింత జాలిపుట్టఁగనీదు
కన్నకూతురి సౌఖ్య మెన్ననీదు

అల్లునియల్క లక్ష్యముసేయనీయదు
గౌరవాగౌరవజ్ఞాన మిడదు
భోగంబులం దాశపుట్టఁగానీయదు
మంచిచెడ్డ లెఱింగి మసలనీదు
ఎంతకల్గిన నాశ నంతంబుకానీదు
చిత్తంబునకు శాంతిచేరనియదు
పరులుదూషింతురని భయంపడఁగనీదు
తను వశాశ్వతమనునీతి తలఁపనీదు
పారమార్థికచింతలఁ బడయనీదు
లోభి లోభిత్వ మేమందు లోకమందు.

॥ పాపము ! శరభరాజు లౌభ్యంబుచేత
భార్యకును గూతునకు ననివార్యమైన
హృదయసంతాప మొనఁగూడె; నిట్టి యెన్ని
హీనసంసారములు ప్రపంచానఁ గలవో.

నాగవిల్లిదినంపు నానుదక్క మఱొక్క
యరకాసు నేఱుఁగదా పరమసాధ్వి
తనకోర్కెదీర జల్తారుచీరయు నెందుఁ
గట్టియెఱుంగదా ఘనచరిత్రి
నారగుబ్బలుదక్క నాఁడునేఁడునునొక్క
పట్టుపోగెఱుఁగదా భాసురాంగి

పుట్టినింటనునోచి నట్టినోములుదక్క-
నొకనోము నెఱుఁగదా . యురుగుణాఢ్య
వేలకును వేలుగలవాని యాలియయ్యు
వట్టినిర్భాగ్యుఁ జేపట్టి నట్టులామె
కలనయిన సౌఖ్యమన నెఱుంగక మెలంగు
నట్టి లోభీశ్వరుఁడు పతియైనకతన.

గీ. తనదు లోభిత్వమున కట్టి ధన్యచరిత
పరమసాధ్వి యిల్లాలౌటఁబట్టికాని
యింకొకతెయైనయెడల గుట్టెల్లఁదొలఁగి
శరభరాజు సంసార మేచ్ఛంద మగునొ ?

మ॥ తనకుంగట్నము బాధలేదని యసందర్భంపు సంబంధ మి
ట్లనుఁగుంబిడ్డకునిశ్చయించెనని యయ్యబ్జాక్షి దుఃఖించి, చే
యునదింకేమియులేక రోషమునసూయోగోయియోచూ
చుకొం
దునటంచు౯ గడునేడ్వఁజొచ్చెనతిధూర్తుంభర్తఁ బీడించుచు౯

క॥ చిన్నప్పుడుఁ నాగ్రహమును
గన్నప్పుడుఁ దెలివిలేని కాంతలకెల్లం
దు న్నూతులు గోతులు నిజ
మెన్నంగా లక్కపిడతలే యగుఁగాదే ?

మ॥ అటుదుఃఖించి పతిప్రియత్న మనివార్యంబంచునూహించి
యిం
కెటుకానున్నదొసీతభాగ్యమదియట్లే యానటంచెంచియిం

కటఁదానిల్వకనిద్రపై నెపముతో నాసాధ్వి లేవంగఁ దాఁ
జటికెల్ వేయుచు నావులించుచును లేచెన్ భర్త వెన్వెంటనే.

గీ. అటు పరస్పరాగ్రహా చిత్తులగుచు వార
లొండొరులతోడ మాటాడకుండ ముందు
జానకమ్మయు, వెనుకను శరభరాజు
నల్లనన్ మెట్లు దిగి క్రిందికరిగినంత.

సీ. గంగారు బంగారు రంగొప్పు నునుగొప్పు
గప్పుకుళ్ళాయి చక్కఁగ ధరించి
లేదులేదనిపించు లేఁగౌనుజిగిమించు
గతిఁబొల్చు తెల్లని గౌనుదాల్చి
వదనమ్ము క్రొత్తచక్కఁదనమ్ము గనలోచ
నమ్ములందు సులోచనమ్ములుంచి
వాటమౌ మేజోటి సీటు తేటునుగీటు
సూటైన మేల్బూటు జోడుదొడగి
గుండె పరికించు రబ్బరు గొట్టమొండు
నడుమునఁదగిల్చి చావడి నడుమ నిల్చి
వైద్యురాలైన దొరసాని వారికప్పు
డెదురుపడె; సీతకై వారు బెదురుపడఁగ.

మ. కూతునకే ప్రమాదమొనగూడెనొయంచును జానకమ్మయు
త్యాతురతన్ భయంపడుచు నచ్చటికేగఁగ నామెతోడనే

యాతఁడుఁగూడ మిక్కిలిభయాతులుఁడై చని చెంతనిల్చిమా
సీతకు నెట్టులున్నదియో చెప్పుమనన్ దొరసానియిట్లనున్.

క॥ పంతులు ! మీరెంతయు ధన
వంతులు, నదిగాక సుగుణవంతులువిద్యా
వంతులు,మీకన్న నుమా
యింతులు,పనిలోవలంతులే సాధింపన్ ?.

గీ॥ వయసు చాలఁగమీరిన వారు వలసి
నంత లోకానుభవమున్నయట్టి వారు
మీకు బుద్ధులు చెప్పుట నాకుఁ దగదు
కాని, చెప్పకతప్పదు గాన వినుఁడు॥

గీ॥ చనువుగల దందుచేత నేమనినఁగాని
నను క్షమింపంగవలయు; సీతనుగురించి
చెప్పుటకులేదు చూచుటతప్ప; మీకు
మార్తె చెంతకు రండొక్క మారు మీరు

క॥ అనిపలికి టక్కు టక్కునఁ
దనజోడొక వింతమైన ధ్వనిసేయఁగఁ జ
వ్వనఁ జావడిగదిలోనికిఁ
జనె నాదంపతులు వెంటఁ జనుదేరంగన్.

సీ॥ బుడ్డిదీపపుఁబొగన్ బూజుపట్టినపట్లు
వెల్లఁగట్టిన చాందినీలుగాఁగ

రేకులూడిన తాటియాకుచాపలె నేలఁ
బరచిన రత్నకంబళులుగాఁగ
చెదపుర్వులల్లిన చెదలుగోడల కెల్ల
జిత్తరువులభాతి చెన్నుమీర
కసులుజారిన నులకుక్కిమంచంబులే
యటఁదూగుటుయ్యాలఁ లగుచుఁదనర
గబ్బిలమ్ముల రెక్క లబ్బురంపడఁజేయు
వింజామరమ్ములై రంజిలంగ
నలుదెసలఁ గ్రమ్ముకొనిన దోమలరవమ్ము
సొగసుకత్తెల సంగీతముగఁ జెలంగ
వరలు నాగదియెల్ల, నాశరభరాజు
రాజ శబ్దంబు మిగుల సార్థకమొనర్చె.
భృంగమ్ముల తెఱంగు ముంగురుల్ చెలరేగి
మొగముదమ్మినిగ్రమ్మి సగముగప్ప
లోలోననె కృశించు నాలోలలోచన
లోచనమ్ములు చాలలోతువార
చక్కని చిక్కని చెక్కుటద్దమ్ములు
కన్నీటి బావులై కళలువాయ
జ్వరతీవ్రమునఁగాగి సన్నగిల్లిన మేని
పసుపుపచ్చనిచాయ పసతొలంగ

జీర్ణమై కడుమాసిన చీరనడంగి
సహజలావణ్య గరిమమ్ము సన్యసింపఁ
బతిపతియటంచు విలపించు రతివిధానఁ
గన్పడుకుమార్తెనరసె నాకన్నతండ్రి.

సీ॥ కంటకావృతభీమ కాననాంతరసీమఁ
గొమరారు కేతకీ కుసుమమట్లు
కడుహైన్యమున భూమిగర్భానఁ బ్రిచ్ఛన్న
గతినడంగిన మేటి రతనమట్లు
హిమజాల శైవాల సముదయమ్ములఁజిక్కి
పంకనిర్మగ్నమా పద్మమట్లు
రాహుగ్రహగ్రస్థ రాకాసుధాకరు
నిస్తేజచంద్రికానిచయమట్లు
మాసిభరియింపరాని దుర్వాసనగల
మాసికల బొంతపైఁ గుక్కిమంచమందు
లేశమును దనువుపై స్మృతిలేకపడిన
కన్నకూతురినరసె నాకన్నతండ్రి.

గీ. మిపుల జ్వరతీవ్రమున మేనస్మృతితొలంగి
పలుగతులఁ బ్రియునిగూరిచి పలువరించు
బాలనొకవేళఁ జూపుచుఁ బలికెనిట్లు
శరభరాజుతో దొరసాని జాలిఁబూని.

శా॥ ఎల్లెమ్మెస్సుపరీక్ష ప్యాసయిన యీయేడేండ్లలోఁగాటికిన్
గాళ్ళుంజాపిన రోగులన్ సయితమున్ గాపాడితింగాని, నా
వల్లంబాయని రోగమొక్కటియుసంప్రాప్తింప; దాశ్చర్యమె
న్నాళ్ళోర్వైననుబాయకున్న యదియూష్ణంబీకుమారీమణిన్.

మ. ఇది పైత్యాయుష్ఫీవరేయయినచో నిన్నాళ్ళుజీవింపనీ
యదు; నాయౌషధమింక నేజ్వరమునేనన్నాళ్ళురానీయ, ది
య్యదిచిత్రంబగువ్యాధివైద్యులకుసుంతైనన్ గ్రహింపంగరా
నిది, నేఁబోల్చితిఁదెల్పెదన్ వినుఁడుదీనింగూర్చిస్పష్టమ్ముగా.

గీ. మీరునమ్మరుగాని సాధారణముగ
డాక్టరులకిట్టి కేసు తటస్థపడదు;
అటు తటస్థపడినయెడ నరసి వ్యాధి
యిట్టిదని గ్రహించుట వట్టిమాట.

ఉ. వ్యాధులయందు నెందునిటువంటిది కల్గదు; దీనికిన్ మనో
వ్యాధియటంచుఁబేరు; తగినట్టుల నౌషధసేవలెన్నొ యే
వ్యాధులకేని దత్తదుచితానుగతిన్ గలవైన నీమనో
వ్యాధికిమందులేదనుచుఁబల్కెదరార్యులు బ్రాహ్మణోత్తమా.

గీ. ఏమహా వ్యాధియునుగూడ నింతఘోర
బాధ కల్గింప దీ మనోవ్యాధిరీతి
మృతునిమాత్రిమె మొదలంటఁ జితిదహించుఁ
గాని, యిది ప్రాణముంచియే కాల్చుచుండు.

సీ॥ నీరు నన్నమునిద్రి గోరనీయకపీల్చు,
దినదినమ్మును శుష్కతనునొనర్చు
లేనిసంకటము లెన్నేనిదాఁగల్పించు,
సహజస్థైర్యధైర్య సమితిగూల్చు
కడుపునఁ బెనుచిచ్చు వోడమించి బాధించు,
కలరూపురేఖల కళలడంచు
తెలివితేటలుడించు దీనత్వమునుగూర్చు;
పనిపాటులొనరించు మనసుమార్చు
క్రిమముగా మంచమెక్కించు నమితరోగ
మందునఁ ముంచుఁ బ్రాణమ్ములపహరించు
వేనవేలుగ లోకాసఁ గానిపించు
వ్యాధులందేది యీమనోవ్యాధిమించు?.

గీ॥ చెఱుకుగానుగునందునఁ జెఱుకువోలె
నీమనోవ్యాధికిం జిక్కి నీ నెలంత;
ఎముకలొసలించి రక్తమాంసములుపీల్చి
పిప్పిచేసినదీమె నీగొప్పవ్యాధి.

క॥ ఈ రమణి మనోవ్యాధికిఁ
గారణమును నే గ్రహించి కలసంగతులన్
మీా రమణికిఁ దెలిపితి; నా
పేరిణమున నీమె మీాకెఱింగించెఁగదా?.

చ॥ ఎఱిఁగియు నింతకాలమిటు లేటికి జాలముచేసినారు? న
మ్మరొ? మరపొందినారొ? యనుమానముచెందిరొ?
రామచంద్రు నీ
వరకును నేలరమ్మనరు? వానిముఖేందువిలోకనంబె యీ
తరుణికి నౌషధంబు; భయదంబగు జాడ్యతమోనివృత్తికిన్.

శా॥ అబ్బాలుంగను రెప్పలెత్తి యొకమారమ్మాయివీక్షించినన్
మబ్బుంబాసినయట్టిపూర్ణశశిబింబంబుల్ విడంబించుచున్
జబ్బుంగిబ్బును సర్వముం దొలఁగిసాక్షాల్లక్ష్మియైతోఁచు; న
బ్బబ్బా! బల్మినిజంపి వేసెదవటయ్యా! యీకుమారీమణిన్

చ. ఎముకలు చర్మమున్ మరియొకించుకయాపిరిదక్క రక్తమాం
సములిసుమంతలేకయె కృశస్థితినున్నకుమార్తెఁగాంచి చి
త్తము నెటులాపఁగల్గితిరొ? ధైర్యము నెట్లువహించినారొ? ధ
ర్మమెయిటువంటిపట్టుదలమానుఁడు కన్నకుమార్తెపట్టునన్.

శా. మేనల్లుండతి బుద్ధిమంతుఁడుఁగదా! మీరేల శంకింతురో
వానిన్ సీతకుఁ గూర్పమీకుఁగల యైశ్వర్యంబ దేనాటికే
నైనన్ సీతదె కాన భూవసతిలేదంచున్ విసర్జించు టే
మైనన్ బాగుగనున్నదయ్య! కలదయ్యా! యిట్టులెందేనియున్

చ. మునుపటియట్లకన్పడదు ముద్దులసీతవిధమ్ముచూడ, నే
ఁడునమునవోరహస్యముగఁగన్నులు రెంటను దేలవైచు; మిం

చినపిదపన్ విచారపడి చేయునదేమియు లేదుకాన, మీ
రును మనజానకమ్మయు నెఱుంగగఁ జెప్పితి నున్నదున్నటుల్

ఉ॥ ఈదొరసానిమందుగుణమీయక యున్నదటంచు నాపయిన్
వాదుఘటింపకుండఁ గలవైఖరి తెల్పితి; నిందుమీఁదమీ
రేదిసమంజసంబనుచు నెంతరొ యట్టులె సేయుఁడయ్య! యా
మీఁదవిధాత యెట్లు నియమించెనొ యట్లె యగానిజంబుగా.

మ॥ తమమేనల్లునకుం గుమారికకు నుద్వాహమ్ము గావింప ని
ష్టము లేకుండిన యంతమాత్రమున నష్టంబేమి? యెట్లైననీ
యమబాధల్ యమబాధలౌటనిసుమంత్రైనన్ విచారించిపం
తముచాలింపుఁడు! రామచంద్రునికిఁ గంటంబెట్టుఁడి బాలకున్.

మ॥ కలరోగంబుతొలంగినన్ బిదప సంకల్పించుకొన్నట్లెమీ
రలొనర్పందగుఁగాని ప్రస్తుతము నీరాద్ధాంతసిద్ధాంతముల్
సలుపన్వచ్చునె? తొల్త ప్రాణములు నిల్పంబెట్టుఁడెట్లైనని
య్యాలి నీలాలకప్రాణదాత తమమేనల్లుఁడె ముమ్మాటికిన్.

శా॥ పోస్టాఫీసున పోస్టుసేయుఁడొకజాబున్ రేపు; నామాటలన్
టెస్టుంజేయఁగవచ్చు; "స్టార్టిమిడియేట్లీ" యంచు వైరిచ్చుటే
బెస్టన్నింటను; వైరుచూచుకొనుచున్ వేవేగ మేల్ట్రైను
లోనే స్టార్టౌనత; డారణాలెకద మీకేమైన వేస్టైనచో.

ఆ. వె. ఆరణాలఖర్చటన్నంత మాత్రాన
గుండెరాయిపడి యతండు నోట

మాటయింతలేక మౌనవ్రతముదాల్చి
నూర్పులిడుచు మిగులనుస్సు రనుచు.

సీ॥ మేనల్లు రప్పింపఁగా నొక్కకాసైనఁ
బలిబంపుటది యసంభవ మటంచు
తంతివార్తయొకాక తగుఖర్చులును బంప
కున్న నాతనిరాక సున్నయనుచు
ఆతండురాకున్న సీతామనోవ్యాధి
తొలఁగుసాధనమింకఁ గలుగఁదనుచు
అమ్మనోవ్యాధి బాయకయున్న సుకుమారి
తనువునిల్వదు యథార్థ మ్మటంచు
కన్నకూతురికింక నేమి గతియటంచు
నేలఁజతికిలఁబడుచుఁ గన్నీరు మిగుల
వరదగా వెక్కి వెక్కి యేడ్వంగఁదొడఁగె,
మానినుల మానికమ్మైన జానకమ్మ.

గీ. పలుకు నులుకును లేనట్టి పతిని గాంచి
పలుగతుల నేడ్చుచున్న తద్భార్యనరసి
తనకుమతిబోవఁ బ్రతిమచందాన నిలిచె
మేనస్మృతిలేని దొరసాని మౌనమూని.

గీ. నోటమాటలులేక యచ్చోటవారు
మువ్వు రాయాస్థితులయందు మునిఁగియుంట

వలననాగ్లైదు నిముసముల్ వఱకు నాగృ
హంబు సర్వంబు నిశ్శబ్దమయ్యెనంత.

ఉ. ఆయవివేకియైన శరభాఖ్యుఁడు తుళ్లిపడంగ, నేమిత
ల్లీయని జానకమ్మ సుతనేస్చుటమానికవుంగిలింప, నా
హాయని వైద్యురాలుఁగడునక్కజపాటునుజెందఁ, 'రామచం
ద్రా"యనుగద్గదధ్వనివినంబడె ముప్పురకొక్కమారుగాఁ.

సీ॥ అమ్మ! ముద్దులగుమ్మ! యనుఁగుసీతమ్మ! నా
బంగారువుంబొమ్మ! బలుకవమ్మ!
బావనేటికి నీవు పలువరించితివమ్మ!
స్వప్నమందతఁడు కన్పడెనటమ్మ!
కబురంపినానమ్మ! గడియకో క్షణముకో
వచ్చునాతఁడు నీవువగవకమ్మ!
నీకువానికిఁ బెండ్లినిశ్చయించితిమమ్మ!
మనసుదిట్టముచేసి కొనఁగదమ్మ!
జ్వరముతగ్గించుకొనుమమ్మ! జడియకమ్మ!
బ్రతికినఁగదమ్మ! యింతకుఁ బరిణయమ్మ!
టంచు నాజానకమ్మ సీతమ్మపైని
వాలికన్నీటి ధారలు గ్రాలవగచె.

గీ. వగచుటయుసీత కన్నురెప్పలుగదిల్చి,
ప్రక్కకును నొత్తిగిలి, తల్లివదనమందు

వదనమిడి, శుష్కదక్షిణ బాహులతను
నామె మెడఁగౌఁగిలించె నత్యాదరమున.

గీ. కౌఁగిలించి వేడి కన్నీటనచోట
జననిఁగూడి తాను జలకమాడి,
మనసునందదేమొ గొణుగుచుఁగ్రమ్మరఁ
గన్నుమూసికొనియెఁ గన్నెమిన్న.

ఆ॥ వె॥ సీతపల్వరింత చెవుల సోకినయంత
మిగులఁ ద్రుళ్ళిపడుచు దిగులు పడుచు
శరభరాజుగారు శిరమొక్కమారూచి
నారదేమి యెంచినారొకాని?

ఆపలువరింత యూలించిసందునలనఁ
గూతుసంగతి యొక్కింత గుర్తెఱింగి
శరభరాజు మనంబింక మరలవచ్చు
ననుచు దొరసాని కొంతధైర్యంబుఁబూని.

చాలరాత్రిమైన దటంచు శరభరాజు
గారి సెలవొంది, మందిచ్చు క్రమము జాన
కమ్మకెఱిఁగించి, యుదయమ్మునందు మరల
వచ్చెద నటంచు నింటికిఁ బయనమయ్యె॥

తదుపరి సీతకున్ మిగుల దగ్గరగానొకనుల్కమంచముఁ
బాదుపుగవేసి, దానిపయిబొంతనమర్చి,యథాప్రకారమా

సదమలశీల జానకమ సత్వరముం దనమేనువాల్చెఁ నా
ముదుసలిలోభియుఁ నిదురఁబోవఁగజప్పున లేచియంతటన్.

చ. తనగదితల్పులున్ బెరటితల్పులు చావడితల్పున్ గనుం
గొని, గడియల్ బిగించి, చిరుగుల్ గలచాపయుఁజింకిగోనెయున్
మునుపటియట్లమర్చుకొని, మూల్గుచుదగ్గుచు, మెల్లమెల్లఁగా
గొణుగుచు మేనువాల్చెగదిగుమ్మముప్రక్కనె బొక్కిపల్లపై.

గీ. అల్పసంతోషులకు నిర్మలాత్ములకును,
మఱియుఁ "గన్నీఫలీ" యను మాన్యులకును
వరలు నిద్రామహాసౌఖ్యవైభవంబు
లోభులకుఁ గల్గునేయెందులోకమందు ?

శా. ఆకాపన్లాడిన బొక్కిబల్లపయిఁ దానాచాపపై గోనెపై
నేకాంతంబుగ మేనువాల్చి తనలోనేమేమొ చింతించుచున్
మూకల్ మూగెనుదోమలందరుముకొంచున్ నిద్రయన్మాటయే
లేకీగీతిగసమ్మహాత్ముఁడు వితర్కింపంగఁజొచ్చెన్ మదిన్.

గీ. ఆరణాలంట ! వైరంట ! ఔర యెంత
జమపులేకన్న దాదొరసానిగుంట ?
దానియబ్బగడించిన ధనముదాచి
యుంచినట్టులె మాటాడుచున్నదిచట.

క. డబ్బున్నర కనరంపిన
నబ్బాలున కందవొక్కొ ? యందినరాఁడో ?

డబ్బున్న వారినెప్పుడు
నిబ్బందులు పెట్టుచుందు రిబ్లేమార్షల్.

క. మేనల్లున కింతకు నొక
కానీకార్డైనఁ జాలుఁగవరేటికి ? నే
మైనన్ వ్రాసిన శీఘ్రిమ
వానిని రమ్మనుటకన్న వ్రాయఁగఁగలదే?

గీ॥ అట్లుకాదట్లుకాదు; మేనల్లుఁగూర్చి
కలతెలంగెల్ల నెఱిఁగింపవలయుఁగాదె?
లేనియెడ వచ్చునో రాఁడొ మేనయల్లుఁ
డతఁడు రాకున్న సీతకు బ్రతుకుగలదె?

గీ॥ అందుచేఁ గవరువ్రాయుట యన్నిగతుల
నుత్తమంబని తోఁచుచు నున్నదిపుడు;
ఐనఁ జిన్నక్షరములతోఁ గానికార్డు
నందుఁ బట్టింపలేనె యెంతైనఁగాని॥

॥ సన్నని పాళీతోడను
జిన్నక్షరములనువ్రాసి చేర్పఁగలను నే
నెన్నైనను సంగతులను;
సన్నముగా వ్రాతుఁగార్డెచాలుఁ నాకుఁ॥

మొన్ననుకలక్టరుకచేరి నున్నక్లర్కు-
నడిగి యొకపాళిదెచ్చితి; నగ్గిపెట్టె

నుంచి నాగదిగూటిలో నుంచినట్లు
జ్ఞప్తియున్నది; యదియందుఁగలదొ? లేదొ?
గీ॥ వెదకెదనుగాకయంచు వేవేగ లేచి
బుద్ధిదీపము వెలిఁగించి భూసురుండు
తనదుగదిలోఁ బ్రవేసించి తడుముకొనుచు
గూటిలోఁ జేయిపెట్టి యన్నాటిరాత్రి॥
గీ॥ ఇటునటుఁ దడుముచుండంగ నింతలోన
నతనిపాప్రబ్ధవశమున నందులోనఁ
జేరి మొదలంటఁగాఁ గుడిచేతి నడిమి
వ్రేలును జటిక్కుమని యొక్క తేలు పొడిచె.
శా॥ ఆలింబిడ్డ నతంఁడులోభియయి యత్యాసత్సముద్రమ్మునన్
గూలంజేసిన కూళయంచుశితలాంగూలాగ్రశూలమ్మునన్
వ్రేలిందేలటుగుట్ట దుర్భర విషోద్వే లానలజ్వాలలన్
గీలల్ రేగి దహింపఁగాఁదొడఁగెదత్కాలాలనాశంబులన్॥
క॥ "కుయ్యో"యని మొఱ్ఱో"యని
"యయ్యయ్యో"! యనుచు రాత్రియంతయు నాతం
డయ్యెడ యమబాధల్ బడ
నయ్యార్తి యడంగ నుదయమయ్యెను నంతన్॥
గీ॥ ఉదయమగుటయుఁ దద్బాధయును నొకింత
తగ్గుటయులేచి కాలకృత్యములు దీర్చి

జానకమ్మను మేల్కొల్పి కానికార్డు
దాసిచేతను దెప్పించి తాను నంత॥

సీ॥ తేలుకాటునఁ దన వ్రేలు వీలుగామి
వడివడిగనేగి పొరుగింటి వారిచిన్న
వాని బ్రతిమాలి జాబును వ్రాయఁజేసి
దాసిచే పోస్టుకంపించె దానినపుడు॥

॥ భర్తయిలుసేరినంతఁ గుమార్తెకడను
వానిఁ గాపుంచి పెరటితోవను బిరాన
సనుఁగు స్నేహితురాలింటికరిగి యచటఁ
జాలసేపుండె నెందుకో జానకమ్మ
ఎచటికేగితి వెందుచే నింతవఱకు
నెచటనున్నావటంచు లోభీశ్వరుండు
తన్నుఁ బ్రశ్నింప నేమేమొ పన్ని చెప్పెఁ;
అట్టివారికడ మెలంగుటట్లుకాదె?॥

3

పండుగ కట్నము

అత్తవారిడు కట్నమందవచ్చు నటంచుఁ
గ్రొత్తయల్లుఁడు చంక గ్రుద్దుకొనఁగ
వచ్చియు రానట్టి వయసువచ్చినబాల
తనకాంతు నరయంగఁ ద్వరపడంగ
ఉల్లమ్ము బెగ్గిల్ల నల్లురాకదలంచి
లోభిమామకు గుండె లొటుకు మనఁగ
అప్పడాల్ వడియాలుఁ బప్పులాదిగఁ గూర్చ
పనులలో నత్తలు మునిఁగి తేల
"వచ్చె వచ్చెను సంక్రాంతి వచ్చె"ననుచుఁ
"పండుగు ప్రయత్నములు చేసికొండ"టంచు
నెల్లకడలను జాటుచు నేగుదెంచె
మాసరాజంబయిన పుష్యమాసమంత॥

సీ॥ ముంగిళ్ళ ముగ్గులు రంగారు తోరణాల్
పసువురాసిన ద్వారబంధములును
సున్నంపు గోడలు సున్నని చీడీలు
మెత్తినయరుగులుఁ గ్రొత్తనగలు
పంచల చాపులుఁ బరికిణీల్జాకట్లు
జలతారు చీరల సంభ్రమములు

తగుపిండివంట యత్నములు నల్లుండ్రకు
నత్తవారలు వ్రాయునుత్తరాలు
ఊరనూరను నింటింట వారివారి
శక్తులకొలందిఁ బెంపొంద జనులయందు
నందఱును గూడనానంద మొందుచుండ్రు
తనరు సంక్రాంతి ముందరి దినములందు

క॥ ఆ లోభాగ్రేసరు ని
ల్లాలికి బాలికకుఁ గూడ నాయానందం
బేలీలఁ గలుగుఁ? బాపము
కాలము వ్యతిరేకమయ్యెఁగద వారికడన్.

ఉ॥ పండుగ చింతలేక, తనపండుగ యల్లుఁడువచ్చి సీతక
న్పండువొనర్చు టేయనిమనంబున నెంచుచుజానకమ్మ, యా
గండమువాయఁగాముడుపుగట్టుచు వచ్చెనొలేదొరామచం
ద్రుండని రెండుపూటలఁగనుంగొనుచుండను రైలువేళలన్.

శా॥ కానీకారుడువ్రాసి మూడుదినముల్ గావచ్చె, నీపాటికిన్
మేనల్లుండడిచూచి రావలసియుండెంగాని రాడయ్యె; నా
కానీకారుడు చేరలేదొ? తనకై ల్లర్చుల్ నిమిత్తంబు కా
నేనింగల్లదొ? యేమికారణమొయంచెం? తేనిదర్కించుచున్.

చ॥ శరభయగారు పొద్దునన చావడిలోనఁ బచారుసేయు న
త్తరి నొకపోస్టుమేనతని దగ్గరకుం జనుదెంచి యొక్కయు

త్త్రరమునొసంగి పోవఁగ నతండును బైకవరూడఁదీసి యా
తురతసులోఁచనమ్ములనుదోట్కా నిరమ్మనజానకమ్మయుఁ.

గీ. వడివడిగ నేగి కొనివచ్చివానికొసఁగఁ
గనుల ధరియించి తోడనే మనసునందు
శరభరాజు త్త్రరంబును జదువదొడఁగె
భార్యకొకమాటయును వినంబడనికరణి.

గీ॥ చదువుచుండంగ నప్పుడా శరభరాజు
గారి ముఖలక్షణమ్ముల తీరుగాంచి
కష్టవిచారకరంపుసంగతి యదేదొ
దానఁ గలదంచు నూహించె జానకమ్మ.

గీ॥ అందుకనుగుణముగ జాబునరసియతఁడు
నేలఁబడవైచి నిట్టూర్పునిగుడఁ జేసి
కన్నులను నీరుగార్చి మొగమ్మువాల్చి
మౌనమునుదాల్చి నోట నేమాటలేక.

గీ॥ దానభీతిల్లి పాపమా జానకమ్మ
వడకు జనియింప గద్గదస్వరముదోప
„అయ్యయో! చెప్పరేమి? మాటాడరేమి?
ఎవరికేయుపద్రవమది యేమి జరిగె?

మ॥ మనమేల్లుఁడురాఘ చంద్రునకు క్షేమంబేకదా ? పుట్టినిం
టనునాతల్లియుఁదండ్రిసౌఖ్యమునన్నారేకదా?" యంచు జె

న్గానునాత్రింబున వారివారినడుగక గోపించి చీకాకుతో
ననెనా బ్రాహ్మణుఁ "డేలప్రేలెదవె జెష్టా! నీవుకష్టాత్మవై."

క॥ నీకొంప మునుఁగలేదే !
నీకోరికలెల్లఁ దీరెనే గయ్యాళీ !
నాకొంపయె మునిఁగినదే
నాకొంపను దీసినాఁడు నాయల్లుండే".

క॥ "అల్లుండనెదరయో ! మే
నల్లుండగు రామచంద్రుఁడా ?" యన "సీ ! సీ !
పాల్గాడఁ దన్నెదను మే
నల్లుండేయైన మేలెయై యుండుఁగదా ?

క॥ పదిగరిసెల రాబడియును
సదిగాకయె సగదునున్న యట్టి మహాత్ముం
డెదనే నల్లునిగాఁ గొనఁ
గఁదలంచిన కామరాజు గతియించెనయో !"

క॥ అనుటయుఁ బక్కున నగియ
వ్వనజానన పల్కె "నేమివచ్చెనో ? యాహా !
మన కామరాజు తాతా
చనిపోయెను ? పాపమతఁడు క్షయరోగికదా ?"

గీ॥ మీకు నల్లుఁడుగాకుండ మేనుబాసెఁ
గాని, పాపము ! మీకూతు కెంతమాందుఁ

బుస్తె ముడివై చియే చనిపోయెనేని
నింతదుఃఖంబు లేకుండునేమొ మీకు !"

గీ॥ అనుటయు శరభరాజు మహాగ్రహమున
మొగముచిట్లించుకొనుచు నమ్మగువ కనియెఁ
"బరమ నిర్భాగ్యురాలవు; వట్టి పశువ
వెందుకుఁ బనికిరానట్టి మందమతివి:

శా॥ నోరెత్తన్ మృదువైనమాటయననీనోటన్ వినన్ రాదు, న
న్నారల్ పెళ్లెదఁ వేను గడ్డిపరకైనన్ నీకుఁగాకుంటి; నే
క్రూరుండిట్లు కుమారికన్ విధవగాఁగోరున్? సిసీ! యింతతో
నోరున్ మూయుము ! పేలఁబోకుమిటు ముందున్ వెన్క
యోచింపకే.

క॥ తాతా ? పాపముచనెనని
నాతోఁ బరిహాసమటివె ? నాయెదటఁ ఛే
నీకైతక్కులు ? చాలును !
లే ! తొలఁగుము ! పొమ్ము ! సిగ్గులేని సిఖండీ !

శా॥ కాసున్ గట్నము బాధలేని కసుయుక్తంబైన సంబంధమం
చాసంజెందితి వ్యర్థమయ్యెనుగదా? యన్నింట మేలైనదిం
కేసంబంధమునాకుఁ గానఁబడదిస్సీ! యెంతనిర్భాగ్యురా
లే సీతమ్మ? వివాహయోగమిఁక లేదేమో కదా దానికిన్?.

శా॥ •పట్టుంబట్టితివీవు సీతకల నిర్భాగ్యంపు మేనల్లునిన్
గట్టన్; నీవనుకొన్న యల్లుడవునేగాఁబోలు? కాదెన్నఁడున్

బట్టింబట్టితినేనుఁగూడఁ బయిసంబంధంబె కావింతుఁగా
కెట్టుల్ నీవనుకొన్నయట్లెపుడుఁగానీయంజుమీ నమ్ముమీ.

క॥ అనిపలికిఁ మౌనముంగొని
ఘనదీర్ఘాలోచనమ్ము గావింపఁ బలిక్
గనుఁగొనుచు జానకమ్మయుఁ
జనకచటనె నిలిచెనట్టి సందర్భమునన్॥

చ॥ కదలిక లేక స్థాణువయి గాఢతరంబగు మౌనమందునన్
బొదలి తపోనిమగ్నహరుఁబోలుచు నాశరభాఖ్యుఁడుండఁద
ద్వదితమునివ్రతంబునకువిఘ్నముగూర్చెఁదటాలుమంచున
య్యదనునవచ్చినట్టియొకయద్భుతమన్మధవిగ్రహంబహో!॥

సీ॥ సూసూగుమీసంపు నునుసొంపుగలవానిఁ
దొగరాయు జిగిరాయు మొగమువాని
మగమీల నగఁబాలు జిగికన్నుఁ గవ వానిఁ
గుదురూని కొదలేని నుదురువాని
కరముంగరాల ముంగురుల రంగులవానిఁ
బొడఁగానబడరాని నడుమువాని
పొంగారు బంగారు రంగుచాయలవాని
నురవైన కరవైన యురమువాని
తళుకులీను నెల బాళియమొలుకువాని
జెలుకువిలుకాని సొగసూని వరలువాని

గనఁదగినవాని నొకని నాకస్మికముగఁ
గరవుదీరంగఁగాంచి రిర్వురునుగూడ॥

సీ॥ వదలలావణ్యాంబు ప్రవహించుకాల్వనాఁ
బ్రక్క పాపటతేటు పరిఢవిల్ల
చలువఁజేసిన ట్వీల్లుషర్టుపైని గులాబి
పట్టునెక్టయి కాంతులుట్టిపడఁగ
సూటైనబ్లాక్స్లైకోటు నీటులతోడ
శోభింగునురంగు కయ్యమాడ
పాలమీఁగడవన్నె గాబ్లెలుమేలిషెరాయి
ముస్తాబును మరింత ముద్దుసేయ
జోడువాఁడాతనికి లేడు లేడటంచు
జోడు మేజోడుఁగూడఁ బల్కుచుండ
శాపవశమున మానవరూపపుగన్న
మారుగతినున్న యానుకుమారునగసి ॥

క॥ సతియును బతియును సత్య
ద్భుతగతిఁగని యొక్కమారు తుళ్లిపడంగా
సతఁడును వారలచెంతకు
సతిరయమునవచ్చి "కుశలమా సీత" యనన్ ॥

శా॥ ఆనందమ్మునజానకమ్మయెదురై యానోయి! నాతండ్రి!నీ
పై నేపాణములుంచి యింతవటుకున్ భద్రమ్ముగానున్న దీ

పై నీమూలమునన్ సుఖించుమను శుభప్రారంభమానింకఁదం
డ్రీ! నాగండము బాపినాడవుగదోయీ! నీవుమమ్మాటికిన్॥

ఉ॥ మామయగారికిప్పుడొకమారు నమస్కృతిజేసి నీకుఁగ
న్యామణినిమ్మటంచు వినయంబుగ వేఁడుకొనంగదోయి! నీ
వేమటు తెల్లబోయెద? విదేసమయంబిఁక మ్రొక్కుమోయి! నీ
మామకు; గన్నులారఁగని మానసమందున సంతసించెదన్॥

గీ॥ అనిపలికి తండ్రికిన్ మ్రొక్కుమనుచు గురువు
తొల్లి ప్రహ్లాదు ముందుకుఁ ద్రోసినట్లు
త్రోసెఁ బతిచెంతకతని నాతోయజాక్షి
త్రోసినంతనె రామచంద్రుండుఁగూడ.

ఉ॥ సుందరమందహాసపురుచుల్ మొగమందునఁదాండవింపఁగా
ముందునకేగి వానిపదముల్ గని మెల్లఁగ మ్రొక్కినంత న
మ్మందుఁడదే మొగొగ్గి తనమందసమందలి సొత్తునిచ్చునచ్చ
చ్ఛందమునన్ “జిరాయు” వనఁజాల కనేకదనదీవనమ్ముల్.

ఉ॥ అంతటితోడఁబోక శరభాఖ్యుఁడు పల్కె “కుమార! తై లుఖ
ర్చెంతయొనయ్య? యెట్లులభియించినదయ్యది? యెవ్వరిచ్చినా
రింతకునీకు? నెంతవ్యయ మేమిరొయొనర్చితి? వావిశేష మొ
క్కింతయెఱుంగఁజేయుమన నేమియుఁబల్కక రామచంద్రుఁడున్

సీ॥ తెల్లఁబోయిన మొగముతో మెల్లఁగఁదన
యత్తనరయుంగ, నామెయు నతనిహృదయ

నిజముగనందు సీతవలెనే కృశియించెను సీతఁజూడ, బా
ష్పజలధిగట్టె, ధైర్యనగసంతతిచే మనరామచంద్రుఁడున్.

గీ॥ రామచంద్రుఁడు, సీత, పరస్పరావ
లోకనంబునఁబడి యదే లోకమట్లు
లోకము మరచియుండ, నాలోన జాన
కమ్మ యత్యాదరమున సీతమ్మ నరసి॥

చ॥ ఁఁచనువుగ బావతో మునుప్రసంగమొనర్చెడుదానవమ్మ! యే
మనియునుబల్క రింపవిపుడయ్యెయొ! యీతనియాశలింక, లే
వనుకొని నిశ్చయించుకొనియా? మరికాఁగలభర్తతోడనే
మనెదటంచు సిగ్గుపడియా ? తనయా ! పలుకాడవేటికే?.

చ॥ మొదటిదెకారణంబయిన ముద్దులగుమ్మ! యథార్థమేనుదె
ల్పెదవిను! నాదుకంఠమున లేశముఁబ్రాణమునుండుదాక, నీ
ముదుసలి దండ్రిపట్టుదుదముట్టదు; కష్టములెన్నియైనఁబొం
దెద,నొకయించుకైన వెనుదీయక కార్యమునిర్వహించెదన్.

మ॥ సకలోపాయములన్ బ్రయత్నపడి నీసంకల్పమీడేర్తు,నీ
కొకలోపంబునుగల్గనీయనుజుమీ! యొక్కింతధైర్యంబుతో
నిఁకనీవ్యాధి తొలంగఁజేసికొని యెల్లనిన్ సుఖింపంగదే?
యకటా!బల్మినిజంపుకొందునటెబిడ్డా! నిన్ను నాచేతులన్?.

మ॥ ఇటుతాఁబట్టినయట్టి కుందేటికి మూడేకాళులన్నట్టు లె
ప్పటికింబట్టినపట్టు మానకనినున్ బాధించినన్,దండ్రిచెం

గటనిన్నుంచక వెంటఁబెట్టుకొని శీఘ్రంబేను బుట్టింటికిం
తటితోనేగి, విశేషమంతయునుమీాతాతయ్యతోఁజెప్పెదన్.
ఉ॥ చెప్పిననాలకించు, నినుఁజంతకుఁబిల్చును, ముద్దులాడు, నీ
కొప్పునుదువ్వు, నక్కునను గూర్చు, సరేయనిరామచంద్రుఁడా
నవ్వుడెపిల్వఁబంపును, రహస్యముగానిఁక నీదుతండ్రికేన్
జెప్పక యేవివాహమునుజేయును, జూతముమీాఁదిసంగతుల్ !.
మ॥ అని, మేనల్లునిగాంచి,,, యోయిసుకుమారా! నీనిమిత్తంబుగా
ననియింకేమియొ చెప్పఁబోవునరికి ,,కౌనా! యొక్కమారిట్లు ర"
మ్మని, తన్నుంబతిపిల్చినట్లగుటచే, నాసాధ్వితాలేచిపో
యెనునందుండక, మేనయ్యల్లుచెవిలో నేమేమొపల్కాడుచున్.
గీ॥ పిదపనందొంటిగానున్న ప్రియులొనర్చు
కొనినసంభాషణక్రమమ్మును, బరస్ప
రానురాగక్రమమును ముందరయవచ్చుఁ
దొలుత జానకమ్మనుగూర్చి తెలియవలయు.
గీ॥ పిలుపువిని నంతనే యామె యులికిబడుచు
భర్తగదిలోనికేగి నిల్వఁబడెనెదుట !
నులకమంచంబుపై వెల్లకిలఁబరుండి,
యేమొ తలపోయుచుండె లోభీశ్వరుండు.
గీ॥ కొన్నినిముసమ్ములగు వరకును నొకింత
పక్కకుఁ దిరిగిచూడక యొక్కమారు

పెద్దనిట్టూర్పువిడిచి, లోభిప్రభుండు
జానకమ్మనుజూచి, తక్షణమలేచి.

గీ॥ ఔనె! నిన్నొక్కసంగతి యడుగవలసె;
నున్నదున్నట్టులే చెప్పకున్న యెడల,
వీపుచేల్చెద నెముకలు విరుగఁదన్ని.
కొంపలోనుండి నినుసాగ నంపువాఁడ.

ఉ॥ మాయగదోచుచున్నది సుమారుగటికెట్టుఘార్జి రెండురూ
పాయిలనాల్గణాలుగద? పై సగుఖర్చుల కెల్లనొక్కరూ
పాయియునై నలేకెటులవచ్చును? మొత్తముగాఁగమూడురూ
పాయిలనాల్గణాలెవరు పంపిరొవానికి నీవె చెప్పుమా! ॥

శా॥ నీవేషాలును నీదుసంగతులు గన్పెట్టగా రహస్యంబుగా
నీనేమైనను బంపియుందువని సందేహింపఁగావచ్చు; నా
కావృత్తాంతముచెప్పి, చేసినది తప్పంచొప్పుకొమ్మింక, నీ
కీవేళ్ల విధియేవ్రాసెనొకదే? యిన్నీ! మహాపాతకీ! ॥

క॥ నానమ్మివేసినావా?
నానునఁగల కానునమ్మినావా! యేదీ!
నేనొక్కమారు చూచెద
నీనానును దీసియిమ్ము! నిజముగ్రహింతున్.

క॥ నీకృత్రిమ మేదైనను
గాకుండిన యెడలఁ జిల్లిగవ్వయునైనన్

లేకున్న వాఁడువచ్చుట
యేకరణిని సంభవించునే గయ్యాళీ! ॥

మ॥ అనియమ్మంచము డిగ్గికట్టెదుట నుగ్రాకారుఁడై నిల్చి నం
తనెయొక్కించుక వెన్కకుంజరిగి కాంతారత్న మప్పట్టునన్
దనకేమార్గముఁగానరాక పతిచెంతం దప్పునంగీకరిం
చినచోఁదన్ను క్షమించునేమోయనిలోఁజింతించిభీతాత్మయై॥

గీ- కాసుగల్లనినానును గళమునుండి
వెలుపలికిఁదీసి, పతికిఁజూపించి, గద్గ
దస్వరంబున నపుడు కాంతాలలామ
గడగడవడంకుచున్ బల్కఁగడఁగెనిట్లు.

మ॥ ఁఇదిగోచెప్పెద వాస్తవమ్మ, విని, నన్నేలీల దండింతురో
యదికానిండు ! తెగించిసిద్ధపడినా, నన్నింటనిర్భాగ్యనే
కద? యాకాసుననన్నపూర్ణకడఁ దాకట్టుంచి,యానాటనే
పదిరూపాయిలు రామచంద్రునకునేఁబంపించిరప్పించితిన్॥

గీ॥ అనుచుఁగన్నీరు గార్చుచు నన్నుమిన్న
చేతులనుమోడ్చి కనుమూసి శిరమువంచి
మౌనమునుదాల్చియుండ నమ్మానవాధ
మాధముఁడు జాలి యొక్కింతయైన లేక ॥

శా॥ గొడ్డంగోసెడువానికన్నను గడుంగ్రూరాత్ముఁడై నాడుచే
దుడ్డుంగై కొని దయ్యమూనినటుగంతుల్ వేయుచున్ లేశమే
యడ్డుంగ లేకయె చచ్చునో బ్రతుకునోయన్ శంకయున్ లేక తా
గొడ్డుబాదిన యట్లు బాదెనహహా ! కోపించిసాధ్వీమణిన్॥

పండుగ కట్నము

పురుషునకునైన స్త్రీకైనఁ దరుచుగాఁగఁ
గష్టదినములనన్నియుఁ గష్టములును
శుభదిమ్ములనన్నియు శుభములెయగు;
సృష్టినై చిత్ర్యమియ్యది స్పష్టపరుచు ॥
గీ॥ తనదుగ్రిహాచారమున నింతదనుకఁబడయ
రానియిడుములఁబడి పొందరానివ్యాధి
నడఁగి కృశియించెసీతమ్మ; యాదినమ్ము
లరిగె శుభదినములు మొదలయ్యెనిపుడు ॥
గీ॥ మంచునంగప్పఁబడి ముకుళించి యుదయ
భానుకిరణ ప్రసారమ్మువలన మిగులఁ
భాసిలినపద్మము విధానవాసిగాంచె
గతమనోవ్యాధియై సీతక్రమముగాఁగ ॥
గీ॥ పతికతనఁదన యెడలెల్ల జితుక లేవఁ
జాలనని మంచమెక్కెను జానకమ్మ;
రామచంద్రుండు సీతసంరక్షణమును
వంట శరభరాజును జేయవలసివచ్చె॥
సీ॥ మంచిమాటల నాదరించుచున్ దన్నులా
లించుచున్ మందుఁద్రావించునపుడు

నామీఁదనొట్టంచు నావంతు కడియొక్క
టంచుఁ బథ్యంబు తిన్పించునపుడు
మనమేమి మాటలాడుకొనిన నియ్యదె వేళ
యంచుఁ దానిద్ర తప్పించునపుడు
ననుఁజూచి లేవవెంతటి గౌరవమటంచు
నడిపించుటకు యత్నపడెడునపుడు
తనపయిందన ప్రియునకుఁదనరునట్టి
ప్రేమగుర్తించి తాను ను బ్రేమనించి
తెలిసి తెలియని వలపులఁదళుకు బోలుకు
సీతయానంద మేమంచుఁ జెప్పవచ్చు! ॥

సీ॥ తలనొప్పియనిసీత పలుకంగఁ గపురంపు
గందంపుఁ బూఁత మొగానఁబూయు
అరుచిపోవదునోటికన దానిమ్మ ఫలములు
మాటిమాటికిఁ దెచ్చి నోటనునుచు
కలవికారంబెట్టు తొలఁగునోయని సంతఁ
దమలపాకులుచుట్టి సమలఁజేయు
మంచిగాలియె రోగికించుమించుగ నౌష
ధంబంచు నించుక త్తరువొసంగు
జ్వరము వచ్చినట్లున్నదని మరలననినఁ
బాణితలమును బ్రియురాలి మేనఁజేర్చు

భావిశుభసూచకంబులు బయలుపడగ
సీతసంరక్షణ మతండు సేయుచుండు॥

ఆ॥ వె॥ ఎట్టిబాధలేక యేమూలుగునులేక
ప్రియునికతనసీత ప్రియము సెందు
"జరుగుచున్న యెడల జ్వరమంత సౌఖ్యంబు
లే"దటన్నమాట వాదుగాదు ॥

ఉ॥ తీయనిద్రాక్షపండ్లు కొని తెమ్మనినప్పుడుగాని, యౌషధం
బీయఁగ వేళయంచు వచియించినయప్పుడుగాని, లేకయిం
కేయదియైనఁ దానడుగనెంచిన యప్పుడుగాని, రామచం
ద్రా!యనియైన, బావయనియైనను బిల్వదుసీత నేర్పునన్॥

ఉ॥ ఒక్కొకవేళనెందులకొ యూరకపక్కన నవ్వుచుండు, రిం
కొక్కొకవేళదుఃఖమున నొక్కటనశ్రులుగార్చుచుండ్రు, పై
నొక్కొకవేళగోప్యముగ నూరక యేమియొ చెప్పుకొండ్రు; పెం
పెక్కనిలేవయస్సుగల యీప్రియులిర్వురనేక భంగులన్.

ఉ॥ "కన్నులనీరుపెట్టకుము కా. గలకార్యముఁగూర్చి, యీశ్వరుం
డన్నివిధంబులన్ సదయుఁడై మనపక్షమెయున్నవాఁడు, నీ
నాన్నయునమ్మయున్ తమమనంబుల నెంతటి పేదవానిగా
నన్ననుకొండ్రొ నేనులలనా ! వినుమంతటి పేదఁగానుజూ."

మ॥ తనప్రాణంబును బంపునట్లె బడిజీతంబెంతొ కష్టంబుతోఁ
బనుచున్ నీజనకుండునాకు; నికనాపై ఖర్చులో నాదుభో

జనమో! బట్టలో! యెట్టుకాలమునుబుచ్చంగల్గుచున్నానో, నీ
జనకుఁడుఁ మరినీవు; నీజననియుఁ శంకింతురే యెన్నఁడేఁ.
మ॥ అతికష్టంబున నింతకాలమును విద్యాభ్యాసముం జేసితిఁ
గఠియించెన్నిమాదినంబులు; నుమాకాంతుండునాయందుదా
నతికారుణ్యముఁజూపినేటికొక యేడయ్యెంజుమీ! యస్మదు
న్నతవిద్యాభ్యసనప్రయత్నఫలమొందంగల్గుచున్నానిటుల్.
ఉ॥ వారిజనేత్ర! నాకుసహపాఠియనంగలఁ డొక్కఁడాజమీం
దారుకుమారరత్నము కతమ్మునఁనిత్యము నేనునున్ జమీం
దారుకుమారునట్టులె ముదమ్మువహింతును, వానిమైత్రిబం
గారపుఁ గొండచందమునఁగల్గెను నాకునిజమ్ము దెల్పితిఁ.
చ॥ వినుము! విశాఖపట్టణపు వీధుల జోడుగురాల బగ్గిపై
ననుదనప్రక్కఁజేర్చుకొని నాప్రియమిత్రుఁడు పోవువేళ, నే
మునుపడినట్టి కష్టములు ముద్దకులేకయె పస్తులుండుటల్
మనసునఁజ్ఞప్తిరాఁగ "విధిమాయయహా!" యనుకొందునంగనా.
ఉ॥ కన్నియ! వానిమైత్రియెటుకల్గెనొ తెల్పెదఁజూడు; వానికిన్
జెన్నినుప్రాణమా; నిరుడు జెన్నినుమేచను నందుటీముతె
న్నెన్నియొవచ్చె; నన్నిటిని నేనెజయించి, మదీయకందుకా
భ్యున్నత కేళికాపటిమనొందితిఁ దత్కలధౌతపాత్రముఁ.
మ॥ అదియేకారణమాదినమ్ము మొదలత్యంతమ్ముస్నేహమ్ముగూ
ర్చి, దయంజూపి, మదీయదీనదశకుంజింతించి, యేలోపముం

డను నీకీపయినంచు ధైర్యమునుబొందంజేసి, నాకెన్ని యో
సదుపాయమ్ములుసేయుచుండెనతఁడో చంద్రాననా! వింటివే?

గీ॥ తాను మెట్రిక్యులేషనుతోనె చదువు
విడుచునట? యింకననుఁ గష్టపడి పరీక్ష
ప్యాసుగమ్మనుచుండె; నా వరుసచూడ
నాతఁడుద్యోగమిప్పించు నంచునెంతు.

గీ॥ అయినఁ బట్టపరీక్ష ప్యాసయినవరకు
మానవలెనని లేదు నామానసమున
నింతకును నెంతప్రాప్తమో యెవ్వఁడెఱుఁగు”
ననుచు భాషించు సీతతో నప్పుడపుడు.

గీ॥ వేడుకలు పరిహాసముల్ వింతలు గుస
గుసలు కథలును నవ్వులు నెసఁగ మెసఁగ
నాయవస్థ బాల్యక్రీడయట్లె వార
లిరువురు గడుపుచుండిరి దేవిధాన.

సీ॥ మందొంటఁబట్టెను మాంద్యంబు తగ్గెను
నన్నంబుపైఁ గొంతయాశకలిగె
తలనొప్పియునుబోయెఁ దరిగెనాయాసమ్ము
జ్వరములేమిని నీరసమ్మడంగె
లేచి కూర్చుండఁగల్గెను నించుకించుక
యడుగులు తడబడ నడువఁదొడగెఁ

అవయవంబులయందు జనసత్వములుగూడె
స్వేచ్ఛగాఁదిరుగాడు చేవదనరె
చిన్నపనులను మెల్లఁగాఁ జేయుచుండె
నాటపాటలు చదువులు నన్నియును య
థావిధి జరుపఁబూనె సీతాలతాంగి
తల్లిదండ్రులుఁ బ్రియుఁడును నుల్లసిల్ల.

ఉ॥ అల్లనఁ జిక్కువిప్పి తలయంటి జలమ్ములువోసి, సీతకున్
దెల్లనిబట్టలిచ్చి నునుతేటనఁగూర్చుచు జానకమ్మ తా
నల్లనియచ్చుబెల్లమున నాలుగుపుంజిల పొంగుబూరెలన్
వల్లభునాజ్ఞగైకొని యుపారము పెట్టెను నమ్మవారికిన్.

శా॥ రంగారంగ మొగానఁబూర్వపుఁగళల్ రాణింప, నాబాలశు
ష్టాంగంబుల్ మరలన్ యథావిధిమనోజ్ఞాకారముంబూన, నెం
దుంగోరంత కొరంతలేక వెలిగెన్ దొల్లింటి సింగారపుం
బంగారంపు నిగారపుం జిగితనూవల్లిన్ విరాజిల్లఁగన్.

కష్టంబులెల్ల సీతా
కష్టములటు సీతకెంతొ కష్టతరములై
కష్టమ్ముపెట్టె; నిపుడా
కష్టమ్ములు విచ్చె; మంచికాలమువచ్చెన్.

కం॥ కాలింబను కూలంబయి
క్రాలియుఁ దనతండ్రి పట్టుకదలించెను న

కాలంబు మాత్రమింకను
రాలేదీగడియవఱకు రాజాననకున్.

క॥ పూర్వంపు బుద్ధిమానక
పూర్వపు దనపట్టుదలను బోవిడువకయే
పూర్వపు రీతినె మొదలిడెఁ
బూర్వపు యత్నముల కయ్యపూర్వుఁడుమరలన్.

ఉ॥ బంధులకుత్తరాలనిపె బాలికకెచ్చటనైన నమంచి సం.
బంధము గల్గెనేని జతపర్చుఁడటంచును; మేనయల్లుసం
బంధపుటాశలేకమునుబాయక, మానకజానకమ్మతా
నుందగుసాధనంబునుగనుంగొనయత్న మొసర్చునెప్పుడున్

గీ॥ పండుగకు నేమయిన నీయవలసివచ్చు
ననుచు రామచంద్రుని సాగనంపనెంచి
,,చదువుపోవును మరల వచ్చెదవుగానఁ
జను" మనుచుఁబల్కె మెల్లంగా శరభరాజు॥

గీ! సీతతోడఁబ్రసంగంబు సేయుచున్న
యత్తకడకేగి మామపొమ్మనిన వార్త
దీనవదనుఁడై యాతండు తెలిపెనపుడు
తల్లియునుగూతురునుగూడఁదల్లడిల్ల॥

ఉ॥ పండుగకట్నమీావలసి వచ్చునటంచునునెంచి,'నిన్ను నిం
దుండఁగనీకపొమ్మనుచునుండిరి మామయగారు? కానినీ

వుండు! భయంబులేదెటులనో సవరించెదనేనె; యింతకున్
బండుగకట్నమిచ్చు భగవంతుఁడె నీకు విచారమేటికిన్ ॥

గీ॥ అనిపలికి జానకమ్మ మేనల్లుతోడ
సీతతోడనట్టులె చాలసేపువరకు
భావిసంగతులనుగూర్చి పలువిధములఁ
దలఁచుచుండంగ నాటి మధ్యాహ్నమందు॥

క॥ అరగంటై యెచటికో చని
పరుగునను దెంచి తొట్రుపడుచును నింటం
జొరఁబడి చావడి తలుపులు
శరభాఖ్యుఁడు మూసె నేమిజరిగెనొ తనకున్ ॥

గీ! తలుపులనుమూసి నిట్టూర్పు లొలుకుచుండ
భార్యకడకేగుదెంచి యా బ్రాహ్మణుండు
పలికెనీలీల గద్గదస్వరముతోడ
రామచంద్రుఁడుగా సీత విభ్రమముజెంద ॥

శా॥ నేనెంతైన నదృష్టవంతుఁడఁగదా ! నిక్కంబుగానేను నా
ప్రాణాలిట్లరచేతనుంచుకొనుచుగా బర్వెత్తుచుగా వచ్చితిగా
నేనీనాడిలు బాసినట్టిక్షణమింతీ! యెట్టిదో కాని యో
హో!నాపైఁబడనున్నగండమదియెట్లో తప్పిపోయెంజుమీ!॥

మ॥ మనయమ్మాయికియుక్తమైనయొకసంబంధంబుచేకూరెనం
చును మాటాడఁగమీరురావలయునంచుగా బేరిసుబ్బన్నని

న్న నేనాకుంగబురంపె నావిషయమున్నాటాడనూహించి యా
పనిపై (బోపుచునుండ మార్గమున నాప్రారబ్ధకర్మంబునన్॥
ఉ॥ ఏమనియందు నూర్గురకునెక్కుడుశిష్యులతోడ శంకర
స్వాములవారు నాకెదురువచ్చుచుఁ గన్పడినారు తోడనే
స్వామికిభిక్షయీయవలెఁ జచ్చితిరా భగవంతుఁడా యటం
చీమెయి నానికంటఁబడకే పరుగెత్తుచు వచ్చితిజుంమీ! ॥
ఉ॥ కంటనొకింతయుంబడక గ్రక్కునవచ్చితిఁగాని లేనిచో
వెంటనె భిక్షకై క్రొత్తికివేయఁడెప్రాణములైదుఁగూడ నా
కంటికి భూతమట్లతఁడు కన్పడుచుండెను నింకమీఁద నే
నింటనెయుందు లేడనుమి యెవ్వరుతల్పులుగు ద్దిపిల్చినన్॥
క॥ వీఁడిల్లుకాల ! "ఎంతకుఁ
బోడట ! తనపాదకట్నమును జెల్లింపన్
బీడించుక తింటాడట !
లేడనుమీ ! శరభరాజు లేడనుమింటన్॥
గీ। నూరుగురితోడఁగొంపలునూర్చునంట
వేలువందలుపాదకట్నాలునంట!
బీదసాదులుననుమాటలేదెయంట!
భిక్షయిడకున్న నాంక్షలు పెట్టునంట ! ॥
ఉ॥ కొట్టితినంచునాపయినిగోపముమానుము! మానకున్నచోఁ
గొట్టుమునీవుఁగూడనను గోపముచెందను; నంతేకాని, నా

గుట్టునుబైటఁబెట్టకుము కొంపకనర్థమువచ్చు నిన్నికన్
గొట్టనుగొట్టనెన్నఁడును గోపముజెందను దిట్టనింతయున్॥

క॥ తలుపులుదీయకుమీ ! గడి
యలుకడు జాగ్రత్తసుమ్మి ? యనియాతురతన్
బలుకుచు నాతఁడు గదిలో
పలికింజని మంచమందుఁబండుకొనంగన్॥

క॥ కలకలమనికిలకిలమని
పలు తెఱఁగుల శరభరాజు పలికినపలుకుల్
తలపోయుచుఁ గడుపులు చె
క్కలుగా నాముగురు నవ్వఁగడగిరిమిగులన్.

గీ॥ నాఁడు మొదలుగ మఱి మూఁడునాళ్ళవరకు
శరభరాజాగ్రహించునన్ వెరపుచేత
వీధితలుపులు తెరువక విసుగుకొనుచుఁ
గాలమును వారుముగ్గురుఁగడపిరంత॥

గీ॥ శరభరాజును నల్లిమంచానఁజేరి
కాలమునుభీతచిత్తుఁడై గడపుచుండె;
అతఁడు తనభోజనము వేళలందుఁదప్ప
గదివిడిచిప్పై కిరాఁడొక్క గడియయైన॥

ఉ॥ ఏమయినన్ రవంతధ్వనియెచ్చటనైనను నాలకించుచున్
జీమచిటుక్కు మన్నఁదన చెంతకు భీతునుగోర వచ్చునా

స్వాములవారిశిష్యులని చెప్పనఁద్రుళ్ళిపడంగఁజొచ్చెఁదా;
నీమెయి మూఁడునాళ్ళరుగ నింతటనాలవనాటిప్రొద్దునన్

గీ॥ శరభరాజు గుమ్మముకడఁజతికిలఁబడి
వ్రేళ్ళనేమేమొ లెక్కలు వేసికొనుచు
నొంటిరిగనుండఁగాఁ బెరటింటినుండి
గుండెలను రెండుచేతులఁగొట్టుకొనుచు॥

మ॥ కనులందశ్రులుగార, గద్గదికతోఁగంఠస్వరంబొప్ప, నా
వనజాతేక్షణ జానకమ్మయటకుం బర్వెత్తుచున్ వచ్చి, యి
ట్లను"నయ్యో!మనకొంపమున్గెనిఁక నేమందున్ గులంబందునన్
మనకయ్యెన్ వెలి,నీళ్ళుపుట్టవిఁక సామాన్యంబుగానెచ్చటన్

శా॥ ఏమే? యేమది? యేమియయ్యెఁ ద్వరగా నేమో యెఱిం
గింపు మం
చామాటల్ వినిలుబ్ధుఁడాతురతతోనామెన్ సమీపింపఁగా
,,ఏమేమంచునుమీరునన్నడుగరాదేమయ్యెనో యయ్యె;నిం
కేమైనన్ మనసీత గొంతుకను మీరేకోసినారింతకున్॥

శా॥ ,,అయ్యయ్యో! మనసీతగొంతుకను నేనాకోసినానిప్పుడే
మయ్యెన్ జెప్పక యేడుపెందులకె జెప్మా"యంచుఁజీకాకుతో
నయ్యబ్జాక్షికనంగనామెయను,,మీయత్నంబుసిద్ధించెఁగా
నయ్యున్ ఖర్చిఁకఁగాదు; సీతకువివాహంబెట్టులౌనీపయిన్॥

ఉ॥ సందియమేల? చిన్నది రజస్వలయైనది; దానిజాతకం
బందు వివాహయోగము రవంతయులేదు; సరేకదా కులం

బందునసాటి బంధువులయందున నీ తలవంపు మీకు నా
కుం దుదకిట్లు వచ్చె; మనకుంగతియేమిఁక నేమిసేయుదుఁ॥

ఉ॥ చిన్నది యీడుదప్పె నిఁకఁ జేయకతప్పదు పెండ్లియంచు నే
నెన్నివిధాలఁ జెప్పకొని యేడ్చితిఁ; జెట్టనుబుస్సుమంచు నే
నన్నది లేశముం దలపరైరికదా? యిపుడేమిదారి? యే
మున్నదిసాధనంబు? గతులున్న వెమీకునునాకునక్కటా!॥

ఉ॥ పెద్దలు మీకునాకు వెలిపెట్టిననోర్చెదరో? కుమార్తెతాఁ
బెద్దదియైనమాట వెలిపెట్టక యల్లుని జేరఁదీసి యి
య్యిద్దరికిన్ రహస్యముగ నెచ్చటనేన్ ముడిపెట్టురో?అయో
ముద్దులబిడ్డ నేనడిసముద్రములోఁ బడవైతురోకదా?॥

॥ అమ్మలక్కల బుగ్గపోట్లందఁజాలఁ
బుట్టినింటికి నాకర్మమునను బోదు
కటకటా! సీతతోడనే గంగలోన
నురికెదరొ మీరలట్టులేయురుకుఁడింక ॥

ఉ॥ అనికన్నీరొలుకంగ రివ్వమనియయ్యబ్జాక్షి వంటింటివై
పునకుం బోవుచునుండఁలుబ్ధుఁడుకరంబుల్ సాచిఁ యానే!
[యెనే!
మనకర్మంబిది యిట్టులున్నయది; యేమార్గంబుచేనైననిం
దనుదప్పించుకొనంగఁజూడవలెఁగర్తవ్యంబెటింగింపుమా!

ఉ॥ గ్రామమువారిపైఁబడి, బకాసురుకైవడిఁ జంపుచుండెనా
స్వాములవారు; కొల్లదపఁజాలను గావున రాత్రివేళ నే
డేమయినన్ రహస్యముగ నేగెద నుబ్బనతోడనంతయున్
సామముగాఁబ్రసంగమునుసల్పెదఁగార్యమునిశ్చయించెదన్॥

చ॥ నిను బ్రతిమాలుకొందునిఁకనీవొకయింతయునీరహస్యమున్
మనయిలుదాటనీకుము ప్రమాదవశం బెవరేమిసేతు రం
గన! వినుమాడుబిడ్డలను గల్గినవారిటువంటి కష్టముల్
గనెదరుచాటుచాటునని కన్నులకున్ముడివైతురేకదా॥

గీ॥ నమ్మమిదిమూడునాలుగు నాళ్లలోనె
యేదయిననొక్క సంబంధమేనుగూర్చి
యేకరాత్రివివాహ మొందేనొనర్తు
లలన! రెండవకంటికిఁ దెలియకుండ॥

గీ॥ అనుటయును జానకమ్మ మీరాడినంత
పలుకు సత్యంబెకాని నాప్రశ్న వినుఁడు!
ఏకరణిదాచఁగలవారొ యీరహస్య
మెవ్వరెఱుఁగనియట్లు మీరింకమీఁద॥

మ॥ తనకున్ సీతనొసంగలేదనుచుఁజిత్తంబందుఁగోపంబుపెం
పునమేనల్లుఁడురామచంద్రుఁడిఁక రేపోనేడొ తానేగి, య
ల్లననాస్వాములవారిఁగాంచి,యిది తెల్లంబొనటుల్ చెప్పి, యా
శను బెట్టింపఁడె? దానిఁదీర్చుకొనరొక్కం బెంతొ ఖర్చౌఁగదా

సీ॥ స్వాములవారిభిక్షకు నెంతలేదన్న
నుండఁగావలెఁగదా రెండునూర్లు!
పాదకట్నంబంచుఁ బట్టిపీడింపంగ
నర్పింపవలెఁగదా నైదునూర్లు!
మనసీతచేవెలి మరలించుకొనుటకు,
నీయఁగావలెఁగదా యేడునూర్లు!
ఆమీఁదపై ఖర్చులందందులంచాలఁ
బోయఁగావలెఁగదా మూఁడునూర్లు!
మరియు స్వాములవారి సమక్షమందె
పెండ్లిసేయుటయే సంభవించెనేని
వందలేకావు, వేలును వదలిపోవు;
పై నిమిాచిత్తమును సీతభాగ్యమింక॥

॥ తప్పదిదిమీకు సీతనాతనికొసంగ
కున్నఁ; గావునరవ్వలేకుండఁ జల్ల
చల్లగాఁబిల్ల నామేనయల్లుఁగూర్చి
పెండ్లి యెవ్వఁ నటంచనిపించుకొనుఁడు? ॥

సీ॥ పలుపలుకులేల? కడసారివలుకువినుఁడు!
వీధిఁబడి వేనవేల్ ఖర్చుపెట్టువారొ?
సీతనారామచంద్రునిఁ జేర్చువారొ?
యేదిసమ్మతమో నిశ్చయించుకొనుఁడు! ॥

గీ॥ అనఁగవిని నిప్పుద్రొక్కినయట్టి క్రోఁతి
గతిని, నున్మాదమెత్తినకరణి, దయ్య
మూనినవిధాన లేశమున్ మేనిపైని
జ్ఞానమదిలేక యూరకే గంతులిడుచు ॥
శా॥ ,,వేలే? వేలకువేల లేఁ? నిజముగా వెచ్చించి జీవించుటె
ట్లే? లేదేయిఁకనేయుపాయమును? వేలే? వేలె? వేలే యటం
చాలీలన్ మదిమాలిపల్కుచును లోభాగ్రేసరుండంతఁదా
నేలన్ వ్రాలెనుమూర్ఛచెందినగతిన్ నిట్టూర్పులంబుచ్చుచున్
ఉ॥ అంతటజానకమ్మ భయబందిపతిన్ బిగియారఁబట్టు, నా
వింతలఁబొంచియుండి కనిపెట్టుచుండిన రామచంద్రుఁడున్
జెంతకువచ్చె; నిర్వురును శీతలమైనజలమ్ము మోమునం
దెంతయుఁ జల్లఁ గొంతతడవేగినయంతనె లుబ్ధుఁడల్లనన్ ॥
చ॥ కనులనువిచ్చి, కట్టెదుటఁగన్పడుచుండిన రామచంద్రునిన్
గనుఁగొని,దుఃఖబాష్పములు గార్చుచులేచి, తటాలుమం
[చునా
తనిబిగియారఁగౌఁగిటనుదాల్చి, మొగానమొగమ్ముచేర్చినె
మ్మనమునఁ దెచ్చుకొన్నయభిమానముతోఁ బ్రతిమాలునీగతిన్ ॥
సీ॥ నాతండ్రి ! రావోయి ! నాయన్నరావోయి !
నాకొంపదీయుట న్యాయమోయి !
నామాటవినుమోయి! నీమామనుగదోయి !
నాయందుదుర్బుద్ధి వాయుమోయి!

గుట్టెల్ల చెరచి నాపుట్టుముంపకుమోయి!
కోరి గడ్డముబట్టుకొందునోయి
నీకుఁజిక్కితినోయి! నీయిష్టమేనోయి
బ్రతికించి నన్నుఁ గాపాడుమోయి
నాదుబ్రతుకెల్ల నీయధీనమెకదోయి
నేనునీవాఁడనెకదోయి నిశ్చయముగ
ముద్దుసీతమ్మ వరహాలమూటనింక
నందుకొనుమోయి! యర్పించుకొందునోయి! ॥

ఉ॥ మారువచింపుమోయి ! యనుమానముఁ జెందకుమోయి !
కన్యనిం
కేరికొసంగనోయి ! పరమేశ్వరు నానవచింతునోయి ! నీ
కోరిననాడె పెండ్లియొనఁగూర్చెద నీపయిఁదప్పదోయి ! నేఁ
గోరినయట్లునన్ ధనముఁగోల్పడనీయకుమోయి!యల్లుఁడా॥

చ॥ అనిపలుమారు వేఁడుకొనుయల్లునకుంబ్రియమున్ ఘటించిభా
ర్యనుగని ‘‘నీదుపంతమెసుమా కొనసాగెనునెట్టకేలకున్
మనమున నీవుఁగూడననుమానముమానుము ! పెండ్లియత్నమీ
దినముననుండిచేయుము! గ్రహించిన దానిఁదలంప నేటికిన్ ?

మ॥ మనసీతమ్మకు నీళ్ళుపోయువరకున్ మర్యాదగాపాడి గు
ట్టునుభద్రమ్ముగనుంచు మెవ్వరికి నేఁడున్ రేపునెల్లుండియున్
మనతల్పుల్ మరితీయఁబోకు మెట్టులైనన్ మూఁడునాళ్ళుంగతిం
చినచో నాపయిలగ్ననిశ్చయము నేఁజేయించెదన్ బెండ్లికై ॥

గీ॥ మగువ! యెల్లుండిబోగిపండుగయె యైనఁ
గనుమపండుగనాటి ప్రొద్దునన నె కాని
యింటిలోనికిరాదుక దేకుమా తెఁ ?
కనుక! మనక దేపండుగదినము సుమ్మి

గీ॥ అనుశరభరాజుపల్కుల నాలకించి
యిన్నినాళ్ల కభీష్టమీడేరెననుచు
నిర్భరానందభరితులై నెగడిరంత
జానకమ్మయు నారామచంద్రుఁ డపుడు ॥

చ॥ చదువరులెంచవచ్చును రజస్వలయైనదా సీత లేక తా
వదలక జానకమ్మ తనపట్టినపట్టును దీర్పనెంచి యి
య్యదియొక యుక్తిపన్నినదొ యంచు నుమాకునునట్టిసందియం
బెదజనియించె నింత కెవ రేమి గ్రహింతురు స్త్రీల
మాయలన్ ॥

మ॥ అరిగెన్ మూడుదినాలు; నాలుగవనాడభ్యంగనస్నానమున్
నెరపెన్ సీతకు జానకమ్మ; మరియున్మేనల్లునిన్ నూతనాం
బరునింజేయఁ బదేపదే తనపతిన్ బ్రార్థింపఁ బ్రార్థింపనా
శరభాఖ్యుండుచికాకుతోఁ గనుమనస్తాపంబుతోఁ గిన్కతో ॥

ఆ॥ వె॥ సీత బాలసారెచేసినప్పుడు తన
యత్తవారొసంగినట్టి చాపు
పురుగు కొట్టుక మిగులఁ జిరుగులుపడఁ బెట్టె
తీసి తీయలేక తీసి యొసఁగె ॥

ఉ॥ ''పండుగపూట సీతకొకబట్టయు నొక్కనగైన లేకిటుల్
మొండిగనుంతురా? యిదియుముచ్చటయా?" యని జాన
కమ్మ, యా
మొండినిబట్టి పెక్కువిధముల్ బలవంతము పెట్టినంత నా
తం డెరువిచ్చె మేటిజలతారుననిండినచీరయున్ నగల్॥

సీ॥ తాకట్టుగాఁబెట్టితప్పించుకొనలేక
విడిచిన కాసులపేర్లజతలు
కొదువఁబెట్టిధనంబుఁగొని గతించినయంతఁ
దనవశంబైనముత్యాలపేర్లు
తగవురానెఱుఁగ నీనగలేమొనీవేమొ
యనిమిగిల్చిన చంద్రహారములును
ధనములేమిని నమ్మకొనఁ జేకగాఁగొన్న
నానులుఁగంటెలొడ్డాణములును
నాగరా లుంగరాలాదిగాఁ గలట్టి
పలువిధంబుల భూషణంబులును నాడు
పెట్టెతీసి యమ్మాయికిఁ బెట్టుమనుచు
భద్రమునుమా యటంచును భార్యకొసఁగె॥

గీ॥ భూమిలోఁ బాతిపెట్టిన భూషణములు
పెట్టెలన్ భద్రపరచిన పట్టుబట్ట
లాదినంబునఁ జెకలించె నతఁడు మిగుల
జానకమ్మయు సీత యాశ్చర్యమొంద॥

సీ॥ సీమంతమును దీర్చి చేమంతులనుగూర్చి
జాళువా బంగారుజడ నమర్చి
చెంగల్వలను శృంగ భంగమ్ముగావించు
కందోయిఁ గాటుక పొందుపరచి
కలకలలాడు చక్కనిముద్దుమొగమునన్
గళ్యాణతిలక మందముగ దిద్ది
కంటెయున్ గాసులుంగరములుఁ గంకణాల్
నానాదిగాఁగలనగలఁదొడఁగి
నాటిపండుగదినము సందడినినెల్ల
సీతకై గుత్తగాఁ గొన్నరీతిఁదనరు
కూఁతునెడముద్దుముచ్చటల్ కొఱఁతలేక
చక్కఁగాఁదీర్చుకొనఁ జొచ్చె జానకమ్మ॥

ఉ॥ కోరికలూరునట్లు తనకూఁతునలంకృతఁజేసి, మేటిజ
ల్తారుబుటాలడాలుకనుఁగ్రాలఁగ, లేతగులాబిరంగులన్
గేరెడుచీరయున్, బసుపునిగ్గుల నుగ్గులులేని మేల్జరీ
గీరలపట్టురైకఁదొడగించెను దల్లికుతూహలంబునన్॥

గీ॥ అట్లలంకృతయైన సీతమ్మనాఁడు
పోతపోసినబంగారు బొమ్మవోలె
మరునిగజ్జెలగుఱ్ఱమ్ముకరణిఁజూడ
వేయికన్నులుఁ జాలనివిధము తోఁచె॥

శా॥ ఆసింగారమునాయొయారమును నాయందమ్ముచందమ్మునా
హాసోద్యన్ముఖనై గనిగ్యమునుగన్నారంగ వీక్షించి, హా!
యీసౌందర్యము నాకుమారికకు నేడెట్లబ్బెనోయంచు నా
డాసీతంగనిక న్నతల్లియొకరం బాశ్చర్య మొందెన్ మదిన్॥

గీ॥ పెరటిలోస్నానమొనరించి తిరిగివచ్చు
రామచంద్రునిదృష్టులారాజ వదన
యందునందటాలునం బడినంత నతఁడు
నిలువునన్ నీరగుచు నట్లెనిలచి పోయె॥

శా॥ ఆలోచించుచు వ్రేళ్ళులెక్కిడుచు నాడాకస్మికావస్థ న
బ్బాలారత్నవినూత్న భాస్వదురులావణ్య ప్రభారాశిఁదా
నాలోకింపఁగఁగన్నుదోయిమిఱుమిట్లై మేనుభ్రమానై తుదిన్
బాలారత్నముసీతయాయనిమదిన్ భ్రాంతింగొనెందండ్రియున్॥

శా॥ చాలంగాలమునుండియాకృపణునైశ్వర్యంబుభూగర్భమం
దాలీలన్ బడియుండి నేడిటుమనోజ్ఞాకారముంబూని య
బ్బాలారత్నముగాఁగ వచ్చెనోయనన్ భాసిల్లెనాసీత; ఔఁ
బోలం జూడఁగ సీత నిశ్చయముగాభూజాతయానేకదా ?

శా॥ సింగారించుట పూర్తియాటయునునాసీమంతినీరత్న మా
రంగన్మంగళవిగ్రహన్ గరవుతీరన్ గాంచి ముద్దాడి లో
నంగౌతూహలముప్పతిల్లఁబతిచెంతన్నిల్పిమ్రొక్కింపమ్రొ
క్కంగన్యామణితండ్రిపాదములకున్ గేల్మోడ్చిమోదమ్మునన్!

సీ॥ జుమికీలఁ గలడాలు గమియింపఁ గాఁజాలు
తాటంకముల తళ త్తళలెసంగ
చొక్కంపు నిగనిగల్ గ్రిక్కిరింప గళానఁ
గ్రాలు హారాలు సుయ్యాలలూగ
చరణ మంజీర ఝుంఝుణఝుణారావ కం
కణ ఘణాఘణఘణక్వణము లలర
నాణెంపు నడుము నొడ్డాణంపుఁ జిరుగజ్జె
లల్లనల్లన ఘల్లుఘల్లు రనఁగ
వదనరదనమ్ములకును జక్కఁదన మొసఁగి
చంద్రికలనవ్వు లేనవ్వు సందడింపఁ
దనకడకువచ్చి మ్రొక్కిన తనయనెత్తి
యక్కునం జేర్చి చెక్కుముద్దాడియాడి॥

గీ॥ ‹‹శీఘ్రమేవ కల్యాణసంసిద్ధిరస్తు
వాంఛితాభీష్ట సత్ఫలప్రాప్తిరస్తు!
ఆయురారోగ్య విభవో›› స్తటంచు నాడు
కన్య నాశీర్వదించెను గన్నతండ్రి॥

ఉ॥ అంతటితోడఁబోక శరభాఖ్యుఁడుకూతుఁనిజాంకభాగమం
దెంతయుఁజేర్చి యాపయినినెందుకొ మెల్లఁగరామచంద్రునిఁ
జెంతకుఁబిల్చి సీతకడఁ జేరిచి బాహువులుసాచి వారిన
త్యంతకుతూహలంబుననునక్కునమిక్కిలియాదరించుచున్

క॥ రాఁగలశుభసూచకములు
కాఁగల దంపతులు మీ మొగమ్ములఁదోచెఁ
సాగించెదఁ గార్యంబిఁక
వేగమెయన జానకమ్మ వినివిని పిదపన్ ॥

చ॥ వెలవెలబారిఁ నేఁడు కడువింతగనున్నవి వీనిచర్యలా
జలనిధులింకునేమొ? కులశైలములేడునుగూలునేమొ చు
క్కలుఁదెగిరాలునేమొకొ జగంబుననెట్టియుపద్రవం బిఁకన్
గలుగునొయంచువింతగనుగాంతునిమోమునిగాంచియిట్లనున్

క॥ మీయాశీర్వాదములకు
మీయభిమానమ్ములకును మీపలుకులకున్
వేయినమస్కారమ్ములు
సేయుచునొకమాటనేనుజెప్పెదవినుఁడీ॥

చ॥ కడకొకచిల్లిగవ్వయునుఁగావలెనంచునునోరువిప్పి మి
మ్మడుగఁడు, మేనయల్లుఁడునునల్లుఁడుగాఁగలవాఁడు, వీనికీ
వడువునఁజింకిచాపొకటి పండుగుకట్న మొసంగి నారహో!
కడుపునలేనిప్రేమయదికౌఁగిటనుండునెనాకుఁజెప్పఁడీ!॥

సీ॥ ఎందుకీ కౌఁగిలింతలిం కేటికిట్టి
ముద్దులాడుట లనుచు నాముదితపలుక
లోనముసిముసి నవ్వుల మేనయల్లు
నరసి యీరీతిపల్కె నాశరభరాజు॥

శా॥ వేళాకోళములాడుచున్నదనుచున్ విన్నావటోయీ! యిటుల్
వేలున్ వందలు నేనొసంగినను దృప్తింజెంద వీవందుచే,
వేలున్ వందలు మించుకట్నమును నర్పింపంగనున్నాడనీ
వేళన్ నీకటుగానదానిఁ గొనిసంప్రీతిన్ బ్రవర్తింపుమా!॥

ఉ॥ పండుగకట్నమంచు నొకపంచలచాపొకయుంగరంబున
ల్లుండగువాని కిచ్చెదరు లోకమునందున, నంతెకాని, యా
తండెదికోరునో తెలిసిదాని ఘటింపఁగఁజేయరెవ్వ, రా
పండుగనాఁడు; కానన దిపండుగకట్నమె నీవె చెప్పుమా!॥

ఉ॥ నిండు మనంబుదేనిపయినీకు జనించెనో! వేలులక్షలున్
నిండినయట్లు దేనిఁగని నిత్యము సంతసమొందుచుందు వా
యండజయాన, నాబిసరుహానన సీతను ముద్దుగుమ్మ నీ
పండుగనాఁడొసంగెదనుబండుగకట్నముగా గ్రహింపుమా!

మ॥ అనిసీతాకరపల్లవంబతని హస్తాబ్జంబునందుంచి నం
తనె పాణిగ్రహణంబొనర్చి యతఁడానందాశ్రువుల్ గారఁగై
కొనెనాపండుగకట్నమంతదనకోర్కుల్ మొల్కలెత్తంగఁదా
మును నెన్నండునులేనిసిగ్గున శిరమ్మున్ వంచెనాసీతయున్॥

వ॥ జరిపెనుబెండ్లి కొన్నిదివసంబులకాగృహమేధి; యేగతిన్
జరిపెనో, లగ్నమైనపు డొసంగినయట్లునికట్నమేమొ? యే
కరణిని నెంతగాధనము ఖర్చొనరించెనో, యావిశేషముల్
శరభయగారి నైజగుణసంగతిఁ బట్టి గ్రహింపఁగోరెదన్॥

సంపూర్ణము.

## ఉపోద్ఘాతము

ఇయ్యది సాంఘికవిషయ పద్యకావ్యము. హాస్యరస ప్రధానము. హాస్యరసప్రధానములగు వచనకావ్యములు మన యాంధ్రభాషయందచ్చటచ్చట నున్నవి కాని, యిట్టి పద్యకావ్యములు మాత్రము మృగ్యములని నాతలంపు. ఈగ్రంథమును బూర్తి చేసిన తరువాత నియ్యది యాంధ్ర మహాశయుల హృదయముల రంజింపఁజేయఁగలదా లేదా యనుసంశయము నాకుఁ గలిగెను. అందుచే నప్పుడప్పుడిందలి పద్యములను విద్యార్థులగు నామిత్రులయొద్దఁ జదువుచు వచ్చితిని. వారిలో ముఖ్యులు మ. రా. శ్రీ బుర్రా శేష గిరిరావుపంతులు, ఎం. ఏ., గారును, అడిదము రామారావు పంతులుగారును. క్రమక్రమముగ నేతత్కావ్యప్రసంగ మీ ప్రాంతమందలి పండితమండలియందు వ్యాపింపఁదొడంగెను. అందుమూలమున ననేకసభలయందు విద్వాంసులయెదుట నీకావ్యమును జదువు మహాభాగ్యము నాకుఁ బలుమారు లభించినది. నాయందభిమానముండుటచేతనో, యీకావ్యమునందించుక ప్రాశస్త్యముండుటచేతనో విద్యార్థు లెల్లరు మత్కావ్యనిర్మాణచాతుర్యమును గొనియాడి త్వరలోఁ బ్రకటింపుమని నన్నుఁ బ్రోత్సాహపరచిరి.

కాలవైపరీత్యముచేత నేనీగ్రంథమును బ్రకటించుట కశక్తుఁడనై యుంటిని. అది గ్రహించి నామిత్రులగు మ.రా.శ్రీ

చేపూరు సుబ్బారావుపంతులు బి. ఏ.గారు నాకభయమొసంగి నన్నుఁగూర్చియు, నా కావ్యమును గూర్చియుఁ దమ జనకు లగు మ.రా.శ్రీ చేపూరుసన్యాసిరాజు పంతులుగారితో విన్న వించిరి. సన్యాసిరాజు పంతులుగారు కవితాభిమానులు. ఉదా రశీలురు. భాగవతోత్తములు. వారు తోడ్పడకుండినచో నీ గ్రంథ మింకనుగొంతకాల మనాముకమై పడియుండవలసినదే ఆయనకే యీగ్రంథమును గృతిసమర్పింపవలయునని తొలుత నిశ్చయించుకొంటిని. కాని సన్యాసిరాజు పంతులుగారు "భాస్కరశివరామకృష్ణ" అను మకుటముతో సర్వస్వరూపుండగు సర్వేశ్వరునియందే తదంకిత భారముంచవలయునని నాకాజ్ఞా పించుటచే, నాయభిమతము కొనసాగలేదు.

ఏతత్కావ్యప్రకటనమున పంతులుగారు నాకొనరించిన మహోపకారమునకు, సర్వేశ్వరుఁడు వారిని వారికుటుంబమును నిరంతరాయురైశ్వర్యాభి వృద్ధితో రక్షించుచుండుఁగావుత మని కోరుచు, మత్కృతజ్ఞతాసూచక పద్యము లీక్రిందఁ బొందుపరచుచున్నాఁడను.

మ॥ అతిసామాన్యులకందరాని సుకవీంద్రాశీర్వచోలబ్ధశా
శ్వతభాస్వద్విభవాయురున్నత యశస్సంపద్విశేషమ్ములన్
సుతసద్బంధుహితాశ్రితప్రతతితో శోభిల్లుముద్యద్గతిన్
సతతంబీవు ధరామరాన్వయమణీ ! సన్యాసిరాజాగ్రణీ ! ॥

మ॥ ధనికుండై కవితాప్రపంచమున నుద్యత్కీర్తినార్జించువాఁ
డనఘా నూటనొకండు; దుర్వ్యయముదుష్టాలాపమున్ దుష్ప్రభో

ధనముంగొల్వు ధనమ్ముచోటఁ బరమార్థజ్ఞానముంగల్గు స
జ్జనులీలోకమునందు మృగ్యులుసుమీ సన్యాసిరాజాగ్రణీ!
మ॥ కవితాశక్తియడంగలేదు, కవివాక్యంబెందు వ్యర్థంబుగా
దవనిన్ దొల్లిటి సత్కవీశ్వరుల శాపానుగ్రహప్రజ్ఞ లో
టువడన్ లే, దిఁక నాదరించు తమబోటుల్ మేటిదాతల్ గుణ
స్తవనీయుల్ కరవౌటచింత్యముసుమీసన్యాసిరాజాగ్రణీ !
సీ॥ శంఖచక్రగదాది సాధనంబులతోడఁ
బుట్టెనే తొల్లింటి భోజరాజు
ఘనచతుర్బాహుసంకలితుఁడై పొడమెనే
రాణ్మహేంద్రపురీవరప్రభుండు
కవచకుండలయుతాంగములతో వెలసెనే
యానాటి కృష్ణరాయాధిపుండు
అగ్నికుండంబునం దవతారమొందెనే
సర్వజ్ఞసింగమహామవరుండు
వారల నిరంతర యశశ్శరీరములకుఁ
గవితయెడఁ గవులయెడలఁ గలిగినట్టి
గౌరవాదరణమ్ములే కారణములు
ఆశ్రితామరభూజ ! సన్యాసిరాజ !
సీ॥ జనకసన్నిభుఁడు నీజనకుండు నినుగన్న
తల్లి మేటిపతివ్రతామతల్లి
నీమందిరంబిందిరామందిర సమంబు
సుగుణాలప్రోవు మీసుబ్బరావు

నీకరం బార్తరక్షాకరంబు త్వదీయ
వర్తనంబు బుధప్రకీర్తనంబు
నీహితంబఖిలాస్థిరైహికరహితంబు
ధర్మాంచితంబు తద్వాంఛితంబు
నీదుజాతంబు పూతంబు నీదుపేరు
నాధునికకవుల చరిత్రమందుఁ జేరు
వినుతకవితాభినవభోజ ! విమలతేజ !
అశ్రితామరభూజ ! సన్యాశిరాజ !

విజయనగరము
23—10—1919

ఇట్లు
భాషాసేవకుడు
కృతికర్త



*